

*డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి సంతాపం తెలియచేస్తూ లోక్‌సభలో ఉత్తర ప్రదేశ్ నుండి ఎన్నికైన ఇండిపెండెంట్ సభ్యులు శ్రీ ఆనంద నారాయణముల్లా ఒకచక్కని ఉర్దూగీతికను ఆలాపించారు. ఆ గీతిక ఇది.*



# విషాదగీతిక



అగ్రశ్రేణినుండి నిష్క్రమించింది ఒక్కరే
ఐనా ఈ సభకు ఎంతవెలితి వచ్చింది
మృత్యుహస్తం ఒక్కజ్యోతినే ఆర్పివేసింది
ఐనా జాతి భవిష్యత్తుపై ఎంతటి అంధకారం వ్యాపించింది

సువాసనలు వెదజల్లే ఒక పూలమొగ్గ
ముళ్ళను వదలివేసి వెళ్ళిపోయింది
మొగ్గతోపాటు సువాసనను కూడా సమాధిచేశారు
అదే ఈ సదస్సుకు మిగిలిపోయిన మహస్సు.



# ఆంధ్రప్రదేశ్

మే 1969

సంపుటి : 13 | వైశాఖం – జ్యేష్ఠం 1891 శా. శ | సంచిక : 7

ప్రధాన సంపాదకులు : బి. కె. రావు, ఐ. ఏ. యస్.

సంపాదకులు : ఎస్. వి. గోపాలశాస్త్రి


# జాకిర్ హుస్సేన్ స్మృతి సంచిక

*ఈ సంచికలో....*

జీవిత విశేషాలు

సంతాప సందేశాలు

రచనలనుండి భాగాలు

పత్రికల నివాళులు

**మూడవ అట్ట :** జామియా మిలియా

**నాలుగవ అట్ట :** హైదరాబాదులో డా. జాకిర్ హుస్సేన్ జన్మించిన గృహం.

**ఫొటోలు :** ఎస్. నందగోపాల్ నాయుడు

"భారతదేశమంతా నా యిల్లు. భారత ప్రజలే నా కుటుంబం. ఈ నా యింటిని శక్తివంతముగా, సౌందర్యవంతముగా చేయడానికి నేను సర్వదా కృషి చేస్తాను. న్యాయ, సౌభాగ్యవంతముగా, ఆనందదాయకముగా అయిన జీవితాన్ని నిర్మించుకుంటున్న ఒక మహాజాతి ప్రజలు నివసించడానికి యోగ్యమైన దానిగా నా యీ యింటికి రూపు రేఖలు దిద్దడమే నా ప్రయత్న లక్ష్యం."

—డాక్టర్ జాకిర్ హుస్సేన్



జాకిర్ హుస్సేన్ చిన్నప్పటి చిత్రం

# డా. జాకిర్ హుస్సేన్ జీవిత విశేషాలు

భారతదేశ భవిష్యత్తును తీర్చిదిద్దిన జగద్విఖ్యాత రాజకీయ వేత్తలు, విద్యావేత్తలు ఆర్థిక నీతికోవిదులు ప్రణాళికా రచనాచతురులు, సాంఘిక వికాస విజ్ఞానమూర్తులైన మహనీయులెందరో మహాత్మాగాంధీ శకంలో అవతరించారు. అయితే పెక్కు రంగాలలో ఏకకాలంలో అనితరమైన ప్రజ్ఞా ప్రాభవములు సంపాదించి అనుపమమైన గణ్యతను సాధించగలగటం సర్వసాధారణంగా ఎల్లరకు సాధ్యమయ్యే పనికాదు. కాని, డాక్టర్ జాకిర్ హుస్సేన్ యిందుకు కేవలం అపవాదు ఆయన కళ్ళకు పరుసవేది ఉంది. ఏ రంగంలో ఏ అంశాన్ని ఆయన ప్రస్తావించినా అదంతా బంగారమే.

డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆంధ్ర రాజధాని హైదరాబాద్‌లో 1897 ఫిబ్రవరి 8వ తేదీన మధ్యతరగతి పఠాన్ కుటుంబంలో జన్మించారు. తండ్రి న్యాయవాది. జాకిర్ హుస్సేన్‌కు ఎనిమిదేండ్లు నిండీ నిండకముందే కుటుంబం ఉత్తరప్రదేశ్‌లోని ఎటావాకు తరలి వెళ్ళింది. ఆయన ప్రాథమిక విద్యాభ్యాసం అక్కడనే పూర్తియైంది. అలీఘర్, బెర్లిన్ విశ్వవిద్యాలయాలలో ఉన్నత విద్య నభ్యసించారు. బెర్లిన్ విశ్వవిద్యాలయం నుండి డాక్టరేటు పట్టాను పొందారు.

## మౌలానా అజాద్ ఒరవడి

మత ప్రమేయంలేని లౌకిక రాజ్యాంగ విధానమందు భారత దేశానికి గల విశిష్ట శ్రద్ధాభక్తి గౌరవాదరాలు జగద్విఖ్యాతములు. భారత స్వాతంత్ర్య సమరంలో పెక్కుమంది జాతీయ ముస్లిము యోధులు అగ్రశ్రేణిలో నిలబడి బ్రిటిష్ సామ్రాజ్యంతో పోరాడారు. చిన్నప్పటినుండి ఆయన రాజకీయభావాలు ఆదర్శములు అన్నికూడ యీ 'సెక్యులరిజం' వెలుగునుండియే దీప్తిని స్ఫూర్తినీ సంతరించుకుని ఎట్టి పెడగాలులకు జెక్కుచెదరని పద్ధతిలో లోతుగా పాదుకొన్నవి. ప్రధానంగా దేశభక్తిపరాయణత, ప్రజాసేవ, క్రమశిక్షణాబద్ధమైన జీవితాన్ని గడపటం వంటి విషయాలలో శ్రీ హుస్సేన్ జగద్విఖ్యాత దేశభక్తుడు శ్రీ మౌలానా అజాద్ ఒరవడిగా పెట్టుకుని తన జీవితాన్ని తీర్చిదిద్దుకున్నారు.

## మౌలిక విద్య

మహాత్మాగాంధి భారతదేశ వాతావరణానికి అనుగుణమైన మౌలిక విద్యావిధానాన్ని చిరకాలంగా భావించి మననంచేసి దానికి 1930 దరిమిలా ఒక నిర్దిష్టమైన నామరూపములను ప్రసాదించి విశేషంగా ప్రచారం చేశారు. శిశువునందు బీజరూపంలో ఉన్న సర్వతోముఖమైన సమస్త వ్యక్తిత్వాన్ని క్రియాభిముఖంగా అభివ్యక్తీకరించడమే మహాత్మాగాంధి ప్రతిపాదించిన నూతన విద్యావిధాన పరమాశయం. ఈ సందర్భంగా 1937లో నెలకొల్పబడిన మౌలిక జాతీయ విద్యాసంఘానికి శ్రీ జాకిర్ హుస్సేన్ అధ్యక్షుడుగా వరించబడ్డారు. 1938 నుండి ఒక దశాబ్దం పాటు శ్రీ జాకిర్ హుస్సేన్ యీ రంగంలో అమోఘమైన కృషిచేసి గాంధీజీ మన్ననలను పొందారు. సేవాగ్రాంలోని హిందూస్థానీ తాలిమి సంఘానికి యీయనే అధినేత.

అగ్రశ్రేణి ప్రముఖ విద్యావేత్తలలో ఒకరైన శ్రీ జాకిర్ హుస్సేన్ విద్యారంగంతో చిరకాలం, పరమసన్నిహితమైన సంబంధాలు గలిగియున్నారు. నేటి, రాబోవు తరాల భవిష్యత్తును ముందుగా భావించి, తదనుగుణమైన చదువు సంజలను గరపి, శిక్షణ నివ్వడమే విద్య అని ఆయన ఒకమారు నిర్వచించారు. ప్రాంతీయ భాషలద్వారా విద్యాబోధన జరగవలెనని వాదించిన వారిలో డాక్టర్ హుస్సేన్ అగ్రపీఠం సంపాదించుకున్నారు.

## జమియా మిలియా ఉపాధ్యక్షుడు

న్యూఢిల్లీలోని జమియా మిలియాకు శ్రీ హుస్సేన్ 22ఏళ్లు ఉపాధ్యక్షులుగా పనిచేశారు. ఈ కాలంలో ఆయన ఉర్దూభాష అభివృద్ధికి అపారంగా దోహదం చేయడం మాత్రమే కాక, ఉర్దూ సారస్వతంలో అనర్ఘ గ్రంథ రత్నరాశిని వెలుగులోకి తెచ్చి యెల్లరికి కరతలామలకం చేశారు. 1948 నుండి 8 ఏళ్ల పాటు శ్రీ హుస్సేన్ అలీగర్ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా పనిచేశారు. ఈయన హయాంలో విశ్వవిద్యాలయంలో దేశకాలానుగుణమైన సంస్కరణలెన్నో ప్రవేశపెట్టబడి అమలుచేయబడినవి.

విద్యారంగంలో కీలక స్థానాన్ని ఆక్రమించిన కేంద్ర సెకండరీ విద్యాబోర్డు, విశ్వవిద్యాలయ గ్రాంట్స్ కమిషన్‌లో కూడా డాక్టర్ జాకిర్ హుస్సేన్ పెక్కేళ్లు సభ్యులుగా పనిచేశారు. డాక్టర్ రాధాకృష్ణన్ అధ్యక్షతక్రింద ఏర్పాటైన విశ్వవిద్యాలయ విద్యాసంస్థ సభ్యుడుగా శ్రీ జాకిర్ హుస్సేన్ విద్యారంగానికి ఎనలేని సేవ చేశారు. ఈ సందర్భంగా వారు తయారుచేసి రూపొందించిన మహత్తరబృహత్తర నివేదికమొత్తం విద్యారంగమునకెత్తిన జయపతాక. ప్రెస్ కమిషన్ సభ్యులుగా చిన్న పత్రికల అభివృద్ధికి యీయన చేసిన అపారమైన సేవా కృషులను పత్రికా ప్రపంచం చిరకాలం కృతజ్ఞతతో స్మరించుకొనగలదు.

## ఉపరాష్ట్రపతి పదవి

స్వతంత్ర భారతం తన ప్రేమపుత్రులలో ఒకరైన డాక్టర్ జాకిర్ హుస్సేన్‌ను పెక్కు విధాల సన్మానించింది. శ్రీ హుస్సేన్ 1957 నుండి 5 ఏళ్లపాటు బీహారు గవర్నరుగా పని చేశారు. 1962 మే నెలలో ఉపరాష్ట్రపతి పీఠాన్ని అలంకరించారు. రాజ్యసభ ఛైర్మన్‌గా శ్రీ జాకిర్ హుస్సేన్ తన నిష్పాక్షిక ప్రవర్తన ద్వారా సభలోని అన్ని వర్గాలవారి ప్రశంసలను, మన్ననలను పొందడమేకాక సభా గౌరవమర్యాద ప్రతిష్ఠలకు పతాకమెత్తారు. ప్రతిపక్ష నాయకులు సైతం యీయన ఆర్జవానికి, నిష్పాక్షికతకూ జోహారు లర్పించారు.

## భారత రత్న

1954 లో శ్రీ జాకిర్ హుస్సేన్‌కు 'పద్మభూషణ' బిరుదు యివ్వబడింది. ఆ తరువాత 9 ఏళ్లకు అనగా 1963లో 'భారత రత్న' బిరుదు యివ్వబడింది. దేశంలోని పెక్కు విశ్వవిద్యాలయాలు ప్రత్యేక స్నాతకోత్సవాల నేర్పాటుచేసి శ్రీ జాకిర్‌హుస్సేన్‌కు డాక్టరేట్ గౌరవ పట్టానిచ్చి సత్కరించినవి. 1956 నుండి 58 వరకు ప్రపంచ విద్యా వైజ్ఞానిక సంస్థ కార్యనిర్వాహకవర్గ సభ్యుడుగా పనిచేసిన శ్రీ జాకిర్ హుస్సేన్ ప్రముఖ విదేశీయుల మన్ననలను చూరగొన్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే అనర్ఘ భారత సంప్రదాయాలకు సహిష్ణుత ఆర్జవం, సెక్యులరిజంలకు స్వర్గీయ డాక్టర్ జాకిర్ హుస్సేన్ మహోజ్వల ప్రతీక.

## పువ్వులపై ఆసక్తి

పువ్వులన్నా, స్ఫటికాలన్నా, రకరకాల రాళ్ళన్నా కోమల హృదయులైన డాక్టర్ జాకిర్ హుస్సేన్‌కు అమితమైన మక్కువ. డాక్టర్ జాకిర్ హుస్సేన్ వ్యక్తిగత పర్యవేక్షణలో రాష్ట్రపతి భవన్‌లోని మొఘల్ గార్డెన్సు రకరకాల పువ్వులతో వెల్లివిరిసింది. బోగెన్ విల్లాలు, ఆర్చిడ్స్ కన్నాస్, రోజాలు వంటి అనేక మేలిజాతి పుష్పాలను మొఘల్ గార్డెన్సులో ఆయన అభివృద్ధి చేశారు. చాలా అరుదుగా కానవచ్చే "షోగర్ల్" "ఫ్రాగ్మెంట్ క్లవుడ్" వంటి పుష్పజాతులతో మొఘల్ గార్డెన్స్ రమ్యంగా కానవస్తాయి. వాటిలో 72 రకాల పుష్పజాతులను అల్జీరియా, మెక్సికోవంటి సుదూర ప్రాంతాలనుంచి ఆయన తెప్పించారు.

డాక్టర్ జాకిర్ హుస్సేన్‌కు పువ్వులతోపాటు రకరకాల రాళ్ళు సేకరించడమంటే అమితమైన ఆసక్తి. అందువల్లనే 1967 మే నెలలో రాష్ట్రపతి భవన్‌కు ఆయన నివాసం మార్చినప్పుడు తనవెంట సుమారు 1500 స్ఫటికాలు, రకరకాల రాళ్ళు, కొన్నివర్ణ చిత్రాలను తెచ్చుకొన్నారు.

స్ఫటికాలపై రాష్ట్రపతికున్న ఆసక్తిని సోవియెట్ ప్రభుత్వం గమనించి సోవియట్ యూనియన్‌లో డాక్టర్ హుస్సేన్ పర్యటించినప్పుడు ఆయనకు బహుఅరుదైన రాళ్ళను, స్ఫటికాలను బహూకరించడం జరిగింది.

# జాకిర్ హుస్సేన్ జీవితం నుండి కొన్ని ఘట్టాలు

డా. జాకిర్ హుస్సేన్ ఇంగ్లాండునుంచి తిరిగిరాగానే ఉస్మానియా విశ్వవిద్యాలయంవారు నెలకు రూ. 600ల వేతనంతో ఉద్యోగం ఇవ్వజూపారు. కానిఆయ్యనదానికిఅంగీకరించక రూ. 300ల నెలసరి వేతనంతో జమియా మిలియాలో ఉద్యోగానికి అంగీకరించారు. జమియా మిలియా ఆర్థికమైన చిక్కులలో ఉన్నప్పుడు ఆయన తన జీతాన్ని 75రూపాయల నెలసరి జీతానికి తగ్గించుకున్నారు. తనసేవలను జమియా మిలియా విశ్వవిద్యాలయానికే అంకితం చేశారు.

*  *  *  *

1946 కేంద్రంలో ఏర్పాటైన కాంగ్రెసు-ముస్లిం లీగ్ మంత్రి మండలిలో డా. జాకిర్ హుస్సేన్‌ను విద్యాశాఖమంత్రిగా ఆహ్వానించారు. గాంధీజీ, జిన్నా, నెహ్రూ, లియాఖత్ అలి ఖాన్‌లు సంయుక్తంగా ఈ సూచనను చేసినప్పటికీ కాంగ్రెసు-ముస్లిం లీగ్‌లు పరస్పరం భిన్నమైనవిగనుక యిట్టి పరిస్థితుల్లో విద్యాభివృద్ధికై కృషిచేయడానికి అవకాశం లేకపోవచ్చునని డా. జాకిర్ హుస్సేన్ ఆ పదవిని సగౌరవంగా తిరస్కరించారు.

*  *  *  *

1945లో డా. జాకిర్ హుస్సేన్ జమియామిలియాకు దగ్గరగా కరోల్‌బాగ్ ప్రాంతంలో ఒక చిన్న యింటిలో వుంటుండేవారు. అప్పుడో ఆయన కంటి జబ్బుతో బాధపడుతుండేవారు. ఒకసారి గాంధీజీ, తానువచ్చి హుస్సేన్‌ను చూడదలుచుకున్నట్లు వర్తమానం పంపించారు. కాని హుస్సేన్ తన బాధ గాంధీజీకికూడ సంతాపాన్ని కలిగిస్తుందనీ, అందువల్ల గాంధీజీని రావద్దనీ తిరిగి కబురు పంపించారు. గాంధీజీ వెళ్ళడం మానుకున్నారు.

*  *  *  *

1947లో పంజాబులో మత కల్లోలాలు చెలరేగినపుడు డా. జాకిర్‌హుస్సేన్ అక్కడ చిక్కుకుపోయారు. ఆయన నిజానికి కాశ్మీరుకు వెళ్ళవలసివుందిగాని అల్లర్లు మూలంగా లూధియానా చేరుకున్నారు. రైల్వే స్టేషను దగ్గర పోలీసు ఇనస్పెక్టర్ శ్రీ హర్బన్స్‌లాల్ ఆయనను గుర్తించి ఆపదనుంచి తప్పించారు. డా. జాకిర్ హుస్సేన్ ఆవిషయాన్ని గుర్తుచేసుకుంటూ ఆనాటితోనే తన బ్రతుకు తెల్లారిపోయిందనీ, ఇప్పుడు తను బ్రతుకుతున్నది ఇతరులు ప్రసాదించిన జీవితమని అంటుండేవారు.

*  *  *  *

ప్రసంగాలు చేయడం డా. జాకిర్ హుస్సేన్‌కు అంతయిష్టం కాదు. 1962లో బుద్ధ జయంతి పార్కులో వనమహోత్సవాలకు ఆయన ప్రారంభోత్సవం చేయవలసివచ్చింది. తనను ప్రసంగించమని అడగకుంటే యీ ఉత్సవాలకు ప్రారంభోత్సవం చేయగలనని ఆయన అన్నారు. అయితే ఉత్సవ కార్యక్రమంలో, అభివృద్ధి కమిషనర్ ఆయనను కొన్ని మాటలు మాట్లాడవలసిందిగా కోరారు. వెంటనే ఆయన లేచి "చెట్టు ఉపయోగమేమిటంటే అది అందరికీ చల్లని నీడను యిస్తుంది. అంతేగాని కబుర్లు చెప్పదు" అన్నారు.

*  *  *  *

1942లో ఒకకాంగ్రెసు కార్యకర్త డా. జాకిర్ హుస్సేన్‌ను చూడడానికి వెళ్ళాడు. అప్పుడు ఆయన ఓ మంచంమీద కూర్చుని రాసుకుంటున్నారు. మరో మంచంమీద ఓ మేక కనిపించింది ఆ కార్యకర్తకు. ఆయన ఔత్సుకతనుచూసి డా॥ జాకీర్‌హుస్సేన్ యిలా అన్నారు. "మావాళ్ళంతా ఎక్కడకోవెళ్ళారు. నా కాలక్షేపానికి యీ మేకమాత్రం ఇంటి దగ్గరేవుండిపోయింది" అని.

*  *  *  *

డా॥ జాకీర్‌హుస్సేన్ ప్రతిభ ఎలా బహుముఖమైనదో అదే విధంగా ఆయన పర్యవేక్షణలో రాష్ట్రపతిభవన్‌లోని మొఘల్ ఉద్యానవనం కూడాబహుముఖాలుగా సుందర సుమాలతో గుబాళిస్తుండేది. రకరకాల బోగన్‌విల్లాలు, మెట్ట తామరలు, గులాబీలు యింకా ఎన్నెన్నో నిండుగా పూసి ఉద్యానవనాన్ని శోభిల్లజేసేవి. దేశదేశాల నించి తెప్పించినరకరకాల గులాబీలు వుండేవి. షోగర్ల్, ప్రాగ్మెంట్ క్లౌడ్, సీపెరల్, ఐరిష్‌పండర్, ఆఫ్రికన్‌స్టార్-యిలాగ రకరకాల గులాబీలను ఆయన నాటించారు. కొన్ని ఎక్కడెక్కడ నించో-అల్జీరియా, మెక్సికోలాంటి సుదీర ప్రాంతాల నించి కూడా తెచ్చినవి వున్నాయి!





# 'విశ్వప్రేమకూ' సౌభ్రాతృత్వానికి ప్రతీక'

—వి. వి. గిరి

రాష్ట్రపతి డా. జాకిర్ హుస్సేనును కోల్పోయిన "ఈ విపత్సమయంలో సమైక్యంగా ఉండి; మతాతీత విధానం, జాతీయతా ఆదర్శాలకు మనలను మనం పునరంకితం చేసుకొనడమే ఆయనకు సమర్పించగలిగిన సముచితమైన శ్రద్ధాంజలి" అని తాత్కాలిక రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి ఆకాశవాణిద్వారా దేశ ప్రజలను ఉద్బోధించారు.

డాక్టర్ హుస్సేన్ "సర్వవ్యాపకమైన మానవీయతకు, విశ్వప్రేమకు, సౌభ్రాతృత్వానికి రూపాంతరమ"ని శ్రీ గిరి అన్నారు. ఆయన ఒక గొప్ప పండితుడు, మర్యాదస్తుడు అని కూడా శ్రీగిరి అభివర్ణించారు.

శ్రీ గిరి తమ ప్రసంగంలో ఇంకా ఇలా అన్నారు: "గౌరవనీయుడైన మన రాష్ట్రపతిజీ డా. జాకిర్‌హుస్సేన్ అకాల మరణానికి లోనయ్యారన్న దుర్వార్త భోపాల్‌లో ఉన్న నాకు పిడుగుపాటులా అందింది. అప్పుడు నేను ఆ రాష్ట్రం గాంధీశతజయంతి ఉత్సవసంఘ సమావేశంలో పాల్గొంటున్నాను. అంత ప్రేమపాత్రుడయిన వ్యక్తిని కోల్పోయినందుకు నాకు కలిగిన దుఃఖాన్ని మాటలలో చెప్పలేను. ఆయనను నేను ఎల్లప్పుడూ నా సోదరుడుగా భావించి, సలహా సహకారాలను కోరేవాణ్ణి. పరిపక్వమైన వివేకం, సానుభూతి, అవగాహనలతో కూడిన ఆయన సలహా నాకు పుష్కలంగా లభించేది. అయితే దేశానికి కలిగిన లోటును తలచుకుంటే, ఒక మిత్రుణ్ణి కోల్పోయినందులకు నాకు వ్యక్తిగతంగా కలిగిన నష్టం అప్రధానమైనది అయిపోతున్నది.

"స్వార్థ త్యాగం, దేశభక్తి ప్రపూరితమైన భావాలతో విరాజిల్లిన జాకిర్ సాహెబ్ సర్వవ్యాపకమైన మానవీయతకు, విశ్వ ప్రేమకు, సౌభ్రాతృత్వానికి ప్రతీక. ఆయన ఒక గొప్ప పండితుడు, మర్యాదస్తుడు. మన సంస్కృతి సంప్రదాయాలలోని ఉత్తమ విలువను, ప్రమాణాలను తమ ధ్యేయంగా పెట్టుకొన్నారు. ముప్పది సంవత్సరాల క్రితం నేను అఖిలభారత ప్రణాళికా సంఘం అధ్యక్షుడుగా ఉన్నప్పుడు ఈ మహా పండితునితో నాకు మొదటిసారిగా పరిచయం కలిగింది. అప్పుడు జాకిర్‌సాహెబ్, జాతిపిత మహాత్మా గాంధీ రూపొందించిన ప్రాతిపదిక విద్యావిధానం ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్నారు. ఆదినుంచి ఆయన గాంభీర్యం, నిరాడంబరత, హుందాతనం, పరిపక్వమైన రాజకీయవిజ్ఞత నన్ను ముగ్ధుణ్ణిచేశాయి. అప్పటినుంచి మా స్నేహం వృద్ధి చెందింది. 1957 అనంతరం మేము, ఇరుగుపొరుగున ఉన్న బీహార్ ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలకు గవర్నర్లుగాను, తరువాత రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతిగాను ఉన్నప్పుడు మా అనుబంధం మరింత బలపడింది. జాకిర్‌హుస్సేన్‌కు శత్రువులు లేరనీ, ఆయన నిజమైన అజాత శత్రువనీ, అందరియందు ఆయనకు ప్రేమ ఉండేవే గానీ, ఎవరియందు ద్వేషం ఉండేది కాదనీ నేను నిస్సంకోచంగా చెప్పగలను.

"మనదేశంలో విద్యావిషయకమైన పునరుజ్జీవనానికి విప్లవాత్మకమైన పద్ధతి ప్రవేశపెట్టడంలో మానవీయతతో కూడిన ఈ అధ్యాపకుడు చేసిన అమూల్యమైన సేవను మనము విస్మరించగలమా? గాంధీజీ నిర్దేశించిన మానవసేవ అనే మహత్తర ఆదర్శాన్ని ఆయన తు. చ. తప్పకుండా అనుసరించారు. విశాల దృక్పథం, జాతీయతా భావంకలవారు. దేశ ప్రగతికోసం ఆయన తమ జీవితాన్ని అంకితం చేసుకున్నారు. మనదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి, లలితకళారంగానికి ఆయన ఎంతో సేవచేశారు. ప్రభుత్వానికి, ప్రజలకు కూడా పెట్టనికోటగా నిలిచి, అధికులు, అల్పులు, హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు, సిక్కులు, పార్శీలు, ధనవంతులు, పేదలు అనే వివక్షత లేకుండా అందరికీ ప్రీతి పాత్రులయ్యారు. జాకిర్‌సాహెబ్ చేసిన బహుముఖ సేవ మనకు ఎల్లప్పుడూ ఉత్తేజం, బలం సమకూరుస్తుంది. ఈ విపత్సమయంలో సమైక్యంగా ఉండి, మతాతీత విధానం, జాతీయత అనే ఉదాత్తాశయాలసాధనకు మనలనుమనం తిరిగి అంకితంచేసుకోవడమే పవిత్రమైన ఆయన స్మృతికి మనం సమర్పించదగు సముచితమైన శ్రద్ధాంజలి."

*

# దేశమే కుటుంబంగా భావించిన విశాల హృదయుడు

**-శ్రీమతి ఇందిరా గాంధీ**

'జీవితంలోని ప్రతి రంగంలోను దేశంయొక్క ఐకమత్యంకోసం, సంఘీభావంకోసం అనిరతంగా కృషిచేసిన ఏకైక వ్యక్తి డాక్టర్ జాకిర్ హుస్సేన్ మాత్రమేననీ, పై ఆదర్శముల సాధనకు ఆయనకంటె ఎక్కువగా కృషిచేసినవారు వేరొకరులేరనీ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ఆలిండియా రేడియో ద్వారా స్వర్గీయ రాష్ట్రపతి జాకిర్ హుస్సేన్‌కు జోహార్లు అర్పిస్తూ ఉగ్గడించారు.

ప్రధాని తమ ప్రసంగంలో యింకా యిలా అన్నారు:

"ఆ మహనీయుడు ఆరాధించిన ఆదర్శాలు, విలువలు; విద్యావేత్తగా, సాంఘిక సేవకుడుగా ఆయన చేసిన అమోఘమైన నిర్మాణాత్మకకృషి; జాతీయ, అంతర్జాతీయ రంగాలలో తాను చేపట్టిన ప్రతి పదవికి ఆయన సంపాదించిపెట్టిన విశిష్టత, ,,నత రానున్న తరాలవారికి వేగుచుక్కవలె మార్గదర్శకములు కాగలవు'

'రాష్ట్రపతి పదవి స్వీకారంచేస్తూ డాక్టర్ హుస్సేన్ అన్న చిరస్మరణీయములైన మాటలు నా స్మృతిపథంలో యిప్పుడు మెదలుతున్నవి. యావద్భారతమూ తన స్వగృహమనీ, భారత ప్రజలంతా తన కుటుంబమనీ, ఆయన ఆనాడు వక్కాణించారు. నేడు ఆ కుటుంబమూ, ఆ భారత దేశమూ ఆయన మరణంపట్ల తండ్రిపోయిన సంతతివలె విలపిస్తున్నవి.

'యావద్భారతజాతి శోకసాగరంలోమునిగియున్నసమయంలో నేనిప్పుడు మాట్లాడుతున్నాను. రెండేళ్ళక్రితం డాక్టర్ జాకిర్ హుస్సేన్‌ను రాష్ట్రపతిగా ఎన్నుకొనడం ద్వారా భారత ప్రజానీకం తన్ను తాను గౌరవించుకుంది. ఈ కొద్దికాలంలోను డాక్టర్ జాకిర్ హుస్సేన్ తాను అధిష్ఠించిన సముచిత పదవికి దీప్తిని, శోభను, గౌరవ ప్రతిష్టలను సంపాదించిపెట్టారు. జీవితంలోని ప్రతిరంగంలోను శ్రీ జాకిర్‌హుస్సేన్ మరేయితర వ్యక్తికీ తీసిపోనివిధంగా జాతీయ ఐకమత్యం కోసం పాటుపడ్డారు.

"బహుముఖమైన భారతీయ సంస్కృతి, సంప్రదాయాలలోని మేలిమి యంతయు ముద్దగట్టిన డాక్టర్ హుస్సేన్ తన ప్రదర్శనద్వారా, తన పలుకుబడిద్వారా మన జాతీయ వన ప్రమాణాన్ని సమున్నత శిఖరాగ్రభూములపై సుప్రతిష్ఠితంచేశారు.

"కేవలం స్వాతంత్ర్య సమరంలోపాల్గొన్న హేతువుచేత మాత్రమేకాక, ఆ మహోద్యమాన్ని ప్రేమించిన మూలప్రాణశక్తి మహిమవల్ల, సమున్నతి నార్జించిన తరంవారిలో ఆయన కట్టకడపటివాడు. ఆయనకేవలం అనుచరమాత్రుడుకాడు. అనుయాయి



స్వర్గీయ రాష్ట్రపతి డా. జాకిర్ హుస్సేన్ భౌతిక కాయానికి శ్రద్ధాంజలి ఘటిస్తున్న శ్రీ వి. వి. గిరి, శ్రీమతి ఇందిరాగాంధి

కాదు. అగ్రగామి, అగ్రగణ్యుడు. ఆయన వ్యక్తిత్వం సృజనాత్మక నూతన భావ ఆదర్శ సంపన్నమగు తదనుగుణ కార్యాచరణ సంశోభితము.

"గాంధిమహాత్ముని పాంచజన్య, దేవదత్త శంఖారావముల వెంబడి తన జీవితంలో నాలుగు దశాబ్దముల అమూల్యమైన కాలాన్ని తను స్థాపించిన విద్యాసంస్థను ప్రోదిచేయ్యడానికి వెచ్చించిన త్యాగమూర్తి, ధన్యజీవి డాక్టర్ జాకిర్‌హుస్సేన్. మన జాతీయ సభ్యతాసంస్కృతీ సంప్రదాయ గర్భితమైయున్న సమున్నతమైన మేలిమికి మాత్రమేకాక, యీ విశాల పృథివిపై మానవుడు సాధించిన సర్వాభ్యుదయానికీ కూడా మనం వారసులమని ఆయన విశ్వసించేవారు.

"డాక్టర్ జాకిర్‌హుస్సేన్‌కు ప్రజలపై, ముఖ్యంగా యువజనులపై శ్రద్ధాశక్తులు ఎన్నడూ సన్నగిల్లలేదు. వారిసమస్యలను, వారి ఆలోచనా పద్ధతిని ఆయన నిరంతరం అతిజాగరుకులై ఒక కంట కనిపెడుతూ వుండేవారు. యువతరంవారి సమాలోచన పద్ధతిలో, చింతనాధారలో నిరంతరంగా ఆదాన ప్రదానం చేయగల అమోఘమైన ప్రజ్ఞ ఆయనకు నైసర్గికంగా అలవడింది. •



# జాకిర్ హుస్సేన్ ప్రవచనాలు

## అస్పృశ్యత అనేదిలేదు

అస్పృశ్యతను పూర్తిగా నివారించాలి. అస్పృశ్యత న్యాయ విరుద్ధమని మన శాసనాలలో ప్రకటించిన మాట వాస్తవమే. కాని దీని తాలూకు ఛాయలు మన మనస్సులలోనుంచీ, మన నిత్య జీవితంలోనుంచీ తొలగించుకోవలసిన బాధ్యత ఇప్పటికీ మిగిలి ఉన్నది.

## యువకులలో అలజడి

మన యువకులలో నిస్పృహవల్ల అశాంతి, ఆందోళనలు వ్యక్తం అవుతున్నాయి. కొన్నిసార్లు ఈ విధమైన అశాంతి, నిస్పృహ వారి క్రమశిక్షణారాహిత్యంలోనూ, హింసాత్మక చర్యల లోనూ స్పష్టం అవుతున్నది. "దేశం తాలూకు ఆశలన్నీ నేటి యువకులపైనే ఉన్నాయి. దేశ భవిష్యత్తు ఉజ్వలంగా, భద్రంగా ఉండాలంటే యువకుల శక్తియుక్తులన్నీ పెంపొందింపచేసి. నిర్మాణాత్మక పద్ధతులలో అవి ఉపయుక్తం అయ్యేలా చేయాలి.

## భిన్నత్వంలో ఏకత్వం

సైన్యాలలో ప్రతి దళంకూడా మన వ్యక్తిత్వాన్ని ప్రతిబింబిస్తూ ఉంటుంది. ఈ దళాలలో హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు, క్రైస్తవులు, ఇంకా ఇతర మతాలకు చెందినవారంతా కలిసిమెలసి ఉంటారు. వీరందరిదీ ఒకే ఆశయం. ఒకే ఆశయం కోసం వీరంతా కలసికట్టుగవనిచేస్తున్నారు. మాతృదేశసంరక్షణకై ఏ విధమైన త్యాగాలు చేయడానికైనా వీరుసంసిద్ధంగా ఉన్నారు. వారు వివిధ భాషలు మాట్లాడుతూ ఉంటారు. అలా వారు విభిన్న భాషలకూ ఆచార వ్యవహారాలకూ చెందిన వారే అయినా వారందరి లోనూ ఒక అంశం స్పష్టంగా కన్పిస్తుంది. అది భారతీయత. భారత దేశ సమైక్యత తాలూకు ప్రధానమైన లక్షణం వారిలో వ్యక్తం అవుతూవుంటుంది.

---

## రాష్ట్రపతిగా శ్రీ వి. వి. గిరి పదవీస్వీకారం

భారత రాజ్యాంగంలోని 65(1) అంశంప్రకారం ఉపరాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి భారత రాష్ట్రపతిగా నియమింపబడ్డారు. రాష్ట్రపతి భవన్‌లో జరిగిన ఒక కార్యక్రమంలో భారత ప్రధాన న్యాయమూర్తి శ్రీ హిదయతుల్లా. శ్రీ వి. వి. గిరిచేత పదవీ ప్రమాణ స్వీకారం చేయించారు. ఈ కార్యక్రమానికి మంత్రిమండలి సభ్యులు, లోకసభ స్పీకరు, రాజ్యసభ డిప్యూటీ ఛైర్మన్, పార్లమెంటు సభ్యులు కొంతమంది హాజరయ్యారు.

## డా, జాకిర్ హుస్సేన్ గౌరవార్థం తపాళాబిళ్ళ విడుదల

స్వర్గీయ డా. జాకిర్ హుస్సేన్ గౌరవార్థం 20 పైసల తపాలాబిళ్ళను విడుదల చేయడానికి తంతి, తపాలాశాఖ నిశ్చయించింది.

డా. జాకిర్ హుస్సేన్ స్వర్గస్థులైన 40వ దినం చెహాలూమ్ నాడు ఈ తపాళాబిళ్ళను విడుదల చేయడం జరుగుతుంది

## స్వర్గీయ డా. జాకిర్‌హుస్సేన్‌కు పార్లమెంటు ఉభయ సభల శ్రద్ధాంజలి

భారత రాష్ట్రపతి ఆకస్మిక మరణంవల్ల ఏర్పడ్డ జాతీయ విషాదచ్ఛాయలలో లోకసభ, రాజ్యసభ సభ్యులు సమావేశమై, డా. జాకిర్‌హుస్సేన్ నిరంతరంగా పరిశ్రమించిన మాతృదేశాభిమానం, జాతీయసమైక్యత, మతరహిత విధానం, మానవ సేవ లక్ష్యాల సాధనకు దీక్షగైకొన్నారు. లోకసభలో శ్రీమతి ఇందిరా గాంధి ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. రాజ్యసభలో శ్రీ జైసుక్ లాల్ హాథి తీర్మానాన్ని ప్రతిపాదించారు.

# ప్రపంచం నలుమూలల నుండి సంతాప సందేశాలు



రాష్ట్రపతి భవన్‌లో మేడ్లైన స్వర్గీయ రాష్ట్రపతి డా॥ జాకిర్ హుస్సేన్ భౌతికకాయంపై పుష్పగుచ్ఛం ఉంచుతున్న రష్యా ప్రధాని కొసిగిన్

## కొసిగిన్

"స్వర్గీయ డాక్టర్ జాకిర్ హుస్సేన్; జవహర్‌లాల్ నెహ్రూ రూపొందించిన శాంతి, తాటస్థ్య విధానాలనే అనుసరిస్తూ వచ్చారు. ఈ విధానాన్నే లాల్‌బహదూర్ శాస్త్రి, ప్రధాని ఇందిరాగాంధి అనుసరించారు. ప్రపంచ శాంతిశక్తులను బలపరచడానికి కృషి చేసే వారితో మేము ఎల్లప్పుడు సహకరిస్తాము" అని సోవియెట్ ప్రధాని శ్రీ అలెక్సీ కొసిగిన్ అన్నారు.

"ఆయన స్వాతంత్ర్య యోధుడు. విద్యావేత్త, సోవియెట్ ప్రజల తరఫున, సుప్రీం సోవియెట్ తరఫున భారత ప్రజలకు హృదయ పూర్వకమైన సానుభూతిని తెలుపుతున్నాము" అని కూడా సోవియెట్ ప్రధాని అన్నారు.

## రిచర్ నిక్సన్

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మరణవార్త విన్న అమెరికా అధ్యక్షుడు రిచర్డు నిక్సన్ తాత్కాలిక రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరికి యీ క్రింది సంతాప సందేశం పంపారు.

"డాక్టర్ జాకిర్‌హుస్సేన్ ఆకస్మిక మరణంవల్ల మీకూ, మీ దేశానికి సంభవించిన అపారమైన నష్టాన్ని పురిస్కరించుకుని నేను పంపుతున్న యీ సానుభూతి సందేశంతో అమెరికన్ ప్రజలెల్లరూ త్రికరణశుద్ధిగా ఏకీభవిస్తున్నారు. ఈ విషాద సమయంలో మేముకూడా మీ విచారాన్ని పంచుకుంటున్నాము. డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మహాధైర్యశాలి. నిష్కళంక చరితుడు. ఆయన మరణంవల్ల ఏర్పడిన లోటు యింతలో తీరునది కాదు."

## బ్రిటిష్‌రాణి ఎలిజబెత్

బ్రిటిష్ మహారాజ్ఞి ఎలిజబెత్, తాత్కాలిక రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరికి అందచేసిన సందేశంలో యిలా అన్నారు. "డాక్టర్ జాకిర్‌హుస్సేన్ ఆకస్మిక మరణవార్త విని నేనూ, నా భర్త చాలా విచారిస్తున్నాము. మీకు సంభవించిన యీ అపారనష్టానికి భారత ప్రజలతోపాటు మేముకూడా దుఃఖిస్తున్నాము. నా యీ విచారాన్ని బేగం హుస్సేన్‌కు, ఆమె కుటుంబానికికూడా తెలియచేయ గోరుతున్నాను."

## బ్రిటిష్ ప్రధాని విల్సన్

"మహాపండితుడుగా, అకలంక చరితుడుగా భారత ప్రజల సర్వాభ్యుదయ సాధనకు జీవితాన్ని అంకితం చేసిన మహా త్యాగమూర్తిగా బ్రిటిష్ ప్రజలకు డాక్టర్ జాకిర్‌హుస్సేన్ యెడల అపారమైన భక్తి గౌరవములున్నవి. అట్టి మహనీయుని మరణవార్త విని నేను చాలా దుఃఖిస్తున్నాను. బ్రిటిష్ ప్రభుత్వం తరుపున నేను మీకు, మీ సహచరులకు నా ప్రగాఢ సంతాపాన్ని తెలియచేస్తున్నానని" బ్రిటిష్ ప్రధాని హెరాల్డ్ విల్సన్ భారత ప్రధానికి పంపిన సందేశంలో పేర్కొన్నారు.



రాష్ట్రపతి భవన్‌లో మే 6న రష్యా ప్రధాని కొసిగిన్, స్వర్గీయ జాకిర్ హుస్సేన్ సతీమణి బేగం షాజహాంను, ఇతర కుటుంబ సభ్యులను కలుసుకుని తన గాఢ సంతాపాన్ని తెలియజేస్తున్న దృశ్యం

## మౌంట్‌బాటెన్

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ ఆకస్మిక మరణాన్ని పురస్కరించుకుని మౌంట్‌బాటెన్ ప్రభువు, ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధికి యీ క్రింది సందేశాన్ని పంపారు.

"రాష్ట్రపతి హఠాన్మరణాన్ని పురస్కరించుకుని మీకు, మీ ప్రభుత్వానికి, రాష్ట్రపతి కుటుంబానికి నేను హృదయ పూర్వకంగా అందచేయుచున్న సానుభూతిని అంగీకరించ కోరుతున్నాము. అంత్యక్రియలకు నేను తప్పకుండా హాజరై ఉండే వాణ్ణి. కాని నేను బహమూస్‌లో వుండిపోయాను.

## పాక్ అధ్యక్షుడు యాహ్యాఖాన్

తాత్కాలిక రాష్ట్రపతి శ్రీ గిరికి పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ యాహ్యాఖాన్ ఒక సంతాపసందేశం పంపుతూ, డాక్టర్ హుస్సేన్ మృతి వలన భారతదేశం ఒక గౌరవనీయ నాయకుడిని కోల్పోయిందని పేర్కొన్నారు. పాక్ ప్రజలు, ప్రభుత్వం తరపున ఆయన భారత ప్రజలకు, ప్రభుత్వానికి సానుభూతి తెలియజేశారు.

## మలేసియా ప్రధాని

మలేసియా ప్రధాని టుంకూ అబ్దుల్ రహమాన్ తాము యీ విషాదవార్త విని ఎంతో విచారిస్తున్నామని, డాక్టర్ హుస్సేన్ మృతి భారతదేశానికి తీరనిలోటు అని విలేఖరులతో అన్నారు.

## పోప్

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి ప్రగాఢ సంతాపం తెలియజేస్తూ, పోప్ పాల్ తాత్కాలిక రాష్ట్రపతి గిరికి ఒక సందేశం పంపారు.

## జపాన్ ప్రధాని

ప్రముఖ రాజకీయవేత్త, విద్యావేత్త అయిన డాక్టర్ హుస్సేన్ మృతికి జపాన్ ప్రజలు, తాము ఎంతగానో విచారిస్తున్నామని జపాన్ ప్రధాని సాటో, భారతప్రధానికి ఒక సంతాప సందేశం పంపారు.

## ఫిలిప్పీన్స్ అధ్యక్షుడు

మానవాళి ఉన్నతి కొరకు అవిరళకృషి జరిపిన డాక్టర్ హుస్సేన్ మృతి విని ఫిలిప్పీన్స్ ప్రజలు దిగ్భ్రాంతులైనారని ఫిలిప్పీన్స్ అధ్యక్షుడు మర్కోస్ తమ సంతాప సందేశంలో పేర్కొన్నారు.

## మలేసియా ఉపప్రధాని

డా॥ హుస్సేన్ మరణవార్త విని తాము దిగ్భ్రాంతి చెందినట్లు మలేసియా ఉపప్రధాని శ్రీ రజాక్ అన్నారు. డా. హుస్సేన్ నాయకత్వం ఒక్క భారతదేశానికేగాక, స్వేచ్ఛా ప్రపంచానికంతకు ఎంతో ఉపయుక్తంగా ఉన్నదని ఆయన అన్నారు.

## కొరియా రిపబ్లిక్ అధ్యక్షుడు

కొరియా రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ పార్ చుంగ్‌కీ, రాష్ట్రపతి జాకిర్ హుస్సేన్ మృతికి తీవ్రవిచారాన్ని వ్యక్తంచేస్తూ సానుభూతి సందేశాన్ని పంపారు.

తాత్కాలిక రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరికిపంపిన సందేశంలో శ్రీ చుంగ్‌కీ ఇలా పేర్కొన్నారు. 'రాష్ట్రపతి జాకిర్ హుస్సేన్ మృతిచెందినట్లు విని నేను చాలా విచారపడుతున్నాను. కొరియా రిపబ్లిక్ ప్రజల తరపున, ప్రభుత్వం తరపున భారతప్రజలకు గాఢమైన సానుభూతి తెలుపుకుంటున్నాను. గొప్ప రాజకీయదక్షుడు, మానవతావాదిని మీరు కోల్పోయినందుకు, మీ దుఃఖంలో మేము కూడా పాలు పంచుకుంటున్నాం'.

## హాంకాంగ్ గవర్నర్

హాంకాంగ్ గవర్నర్ సర్ డేవిడ్ ట్రెంచ్, రాష్ట్రపతి జాకిర్ హుస్సేన్ మృతికి సంతాపం తెలుపుతూ భారత హైకమిషనర్‌కు సందేశం పంపారు.

జాకిర్‌హుస్సేన్ మృతి సహృదయులైన వారందరికీ లోటు అని ఆయన ఆ సందేశంలో పేర్కొన్నారు.

డా. జాకిర్ హుస్సేన్ రాజకీయ దక్షత వల్లనేగాక, పాండిత్యానికి, విద్యారంగంలో చేసిన కృషికి ఆయన ప్రపంచఖ్యాతి నార్జించారు. తన కృషిద్వారా ప్రపంచంలో, వివిధ జాతులమధ్యా, వివిధ దృక్పథాలుగల ప్రజలమధ్యా సదవగాహన పెంపొందించడానికి యత్నించారు. ఆయన మరణించడం సహృదయులైన వారందరికీ లోటు అని ఆ సందేశంలో సర్ డేవిడ్ ట్రెంచ్ పేర్కొన్నారు.

## జాంబియా అధ్యక్షుడు

జాంబియా అధ్యక్షుడు కెన్నెత్ కౌండా, డాక్టర్ జాకిర్ హుస్సేన్‌ను తోహాగ్రర్సిసూ. సాహసోపేతము, విప్లవాత్మకమైన వ్యవసాయ సంస్కరణలను ప్రతిపాదింప జేయడంలో ఆయన నాయకత్వలక్షణాలు ఆవిష్కృతమైనాయని శ్లాఘించారు.

భారత ప్రభుత్వానికి, రాష్ట్రపతి కుటుంబానికి సానుభూతి సందేశాన్ని పంపుతూ, స్వర్గీయ రాష్ట్రపతి మానవ కారుణ్యదృష్టి గలవారని శ్రీ కౌండా ప్రస్తుతించారు.

## దక్షిణ వియత్నాం అధ్యక్షుడు

దక్షిణ వియత్నాం అధ్యక్షులు గుయెన్‌వాన్ థియూ, డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మృతికి సంతాపం ప్రకటిస్తూ భారతప్రభుత్వానికి ఒక సందేశం పంపించారు.

## కెనడా గవర్నర్ జనరల్

కెనడా గవర్నర్ జనరల్ శ్రీ రోలెండ్ మిచ్నెర్ శ్రీ వి. వి. గిరికీ, కెనడా ప్రధాని పియరీ ఇలియట్ శ్రీమతి ఇందిరా గాంధీకి డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మృతికి సానుభూతి సందేశాలను పంపారు.

శ్రీ మిచ్నెర్ తన సందేశంలో ఈవిధంగా పేర్కొన్నారు:

"డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి మీతో పాటు కెనడా ప్రజలుకూడా విచారిస్తున్నారు. ఆయన సౌజన్యం, ఉదాత్తత, కెనడాతో ఆయనకుగల మైత్రి జగద్విదితం. కెనడా శతజయంత్యుత్సవాలకు హాజరైనప్పుడు ఆయనఎందరో స్నేహితులను సంపాదించుకున్నారు. వారి తరపున కామన్వెల్త్‌లోని మా సోదరరాజ్యం ఇండియాకు ప్రగాఢ సంతాపాన్ని వెలిబుచ్చుతున్నాము".

## ఆస్ట్రేలియా గవర్నర్ జనరల్

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ ఆకస్మిక మరణవార్త విని తాను దిగ్భ్రాంతి చెందానని ఆస్ట్రేలియా గవర్నర్ జనరల్ సర్ పాల్ హన్‌లక్, తాత్కాలిక రాష్ట్రపతికి పంపిన సందేశంలో తెలియజేశారు.

తన తరపున, ఆస్ట్రేలియా ప్రజల తరపున, భారత ప్రజలకు తమ గాఢ విచారాన్ని తెలియజేసారు.

## సింహళ ప్రధాని

డాక్టర్ హుస్సేన్ మృతికి తమ గాఢ విచారాన్ని తెలియజేస్తూ సింహళ గవర్నర్ జనరలు శ్రీ విలియం గోపల్లవ, ప్రధాన

మంత్రి డడ్లీ సేనా నాయకేలు తాత్కాలిక రాష్ట్రపతికి, శ్రీమతి హుస్సేన్‌కు సంతాపాలు పంపించారు.

## ఇథియోపియా రాజు

రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆకస్మిక మృతి తనకు తీవ్ర సంతాపాన్ని కలుగజేసిందని ఇథియోపియా రాజు హెయిలీ సెలాసీ తెలియజేశారు.

ఇథియోపియా ప్రధానమంత్రి తన గాఢ సంతాపాన్ని తెలియజేస్తూ భారత ప్రధానికి ఒక సందేశం పంపించారు.

## బ్రిటిష్ హైకమిషనర్

డాక్టర్ హుస్సేన్ ఆకస్మిక మృతికి బ్రిటిష్ హైకమిషనర్ మోరిస్ జేమ్సు తన గాఢ-విచారాన్ని తెలియజేశారు.
తమ సానుభూతిని తెలియజేస్తూ సర్ జేమ్స్ శ్రీమతి, హుస్సేన్‌కు వ్యక్తిగతంగా లేఖ వ్రాశారు.

## ఇండోనేషియా రాయబారి

ప్రముఖ విద్యావేత్తేకాకుండా, రాజకీయ దక్షత కలిగిన వ్యక్తిని భారతదేశం కోల్పోయిందని ఇండోనేషియా రాయబారి మహమ్మద్ రజీవ్ అన్నారు.

భారత ప్రజల విచారంలో తనతోబాటు మొత్తం ఇండోనేషియా ప్రజలుకూడా భాగం పంచుకుంటారని ఆయనతెలియజేసారు.

## అమెరికా మంత్రి రామ్నే

"డాక్టర్ జాకిర్ హుస్సేన్ విశాల దృక్పథం గల వ్యక్తి, గొప్ప విద్యావేత్త, పార్లమెంటేరియన్, ప్రపంచంలోని పెద్ద ప్రజాస్వామ్య దేశానికి అధినేత" అని అమెరికా గృహ నిర్మాణ పట్టణ ప్రాంతాల అభివృద్ధిశాఖ మంత్రి శ్రీ జార్జి రామ్నే జోహార్లు అర్పించారు.

"సంవత్సరం క్రితం ఆ మహనీయుని నేను న్యూఢిల్లీలోనే కలుసుకున్నాను. రాష్ట్రపతి సమైక్య భావాలకు, మానవతా దృక్పథానికి నేను ఎంతో ముగ్ధుడ్నయ్యాను.

'1967 లో డాక్టర్ జాకిర్‌హుస్సేన్ అమెరికా సందర్శించినపుడు నా స్వరాష్ట్రమైన మిచిగన్‌లో మిచిగాన్ యూనివర్శిటీ ఆయనకు గౌరవడాక్టరేట్‌ను ప్రదానంచేసినది. అది మాకు గర్వకారణం" అని కూడా శ్రీ రామ్నే అన్నారు.

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మరణంతో ఇండియాతోపాటు ప్రపంచం కూడా ఒక గొప్ప వ్యక్తిని కోల్పోయింది" అని ఆయన జోహార్లు అర్పించారు.

## యుగోస్లావియా ప్రధాని

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మరణవార్త తన కెంతగానో సంతాపం కలిగించినట్లు యుగోస్లావియా ప్రధాని శ్రీ మైకోస్పిల్జాల్ నిన్న పేర్కొన్నారు. ఇండియాకు తానురావడం ఇదే ప్రథమమని, అయితే రాష్ట్రపతి డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మరణించిన సందర్భంలో రావడం మిక్కిలి దురదృష్టకరమని ఆయన అన్నారు.

రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ మరణ వార్త యుగోస్లావియా ప్రజలకు దిగ్భ్రాంతిని కలిగించినట్లు ఆయన చెప్పారు.

## చెస్టర్ బౌల్స్

''డాక్టర్ జాకిర్ హుస్సేన్ మరణవార్త విని నేను, నా శ్రీమతి దిగ్భ్రాంతి చెందాము. మేము ఒక ప్రియమిత్రుని కోల్పోయాము, ఇండియా ఒక మహానాయకుని కోల్పోయింది.'' అని ఇండియాలోని అమెరికా మాజీ రాయబారి చెస్టర్‌బౌల్స్ తన సంతాప సందేశంలో పేర్కొన్నారు.

## పశ్చిమ జర్మనీ ఛాన్సలర్

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మరణించారన్న వార్త తనకెంతో మనస్తాపం కలిగించినదని పశ్చిమ జర్మనీ ఛాన్సలర్ కీసింగర్ భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధికి పంపిన సానుభూతి సందేశంలో పేర్కొన్నారు.

ఆయన మృతి భారత ప్రజలకు గొప్ప లోటు అని కీసింగర్ అన్నారు.

## ఆస్ట్రేలియా ప్రధాని

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి తన తీవ్ర సంతాపాన్ని తెలియజేస్తూ ఆస్ట్రేలియా తాత్కాలిక ప్రధాని జాన్‌మెక్వెన్ సందేశం పంపారు.

## గయానా ప్రధాని

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి గయానా ప్రభుత్వం తరపున తన తరపున, సంతాపం తెలియచేస్తూ ప్రధాని బర్న్‌హామ్ భారతప్రధాని శ్రీమతి ఇందిరాగాంధికి ఒక సందేశం పంపారు.

## మలావీ అధ్యక్షుడు

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మరణవార్త తనకు దిగ్భ్రాంతినీ, తీవ్ర సంతాపాన్నీ కలిగించిందని మలావీ అధ్యక్షుడు కె. ఝ. బాండా భారత తాత్కాలిక రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరికి పంపిన ఒక సందేశంలో పేర్కొన్నారు. డాక్టర్ హుస్సేన్ మృతి భారత ప్రజలకే కాక ప్రపంచ ప్రజలందరికీ పెద్ద దెబ్బ అనీ, ప్రపంచ శాంతికి, ప్రజాసంక్షేమానికి ఆయన జరిపిన అవిరళకృషి చిరస్మరణీయమనీ ఆయన తన సందేశంలో జోహార్లర్పించారు.

## యుగోస్లావియా ప్రెసిడెంట్

డాక్టర్ జాకిర్ హుస్సేన్ ప్రముఖ రాజనీతిజ్ఞుడని, మానవతావాదీ, శాంతి సౌభాగ్యాల రథసారథి అనీ యుగోస్లావియా ప్రెసిడెంట్ టిటో వర్ణించారు.

శ్రీ వి. వి. గిరికి తన ప్రగాఢ సంతాపసందేశాన్ని పంపుతూ యుగోస్లావియా ప్రజలు డాక్టర్ హుస్సేన్ స్మృతిని చిరకాలం నిలుపుకొనగలరని పేర్కొన్నారు.

శ్రీ టిటో, ప్రధానికి ప్రత్యేకంగా మరొక సందేశం పంపారు.

ఆ సందేశంలో శ్రీ టిటో ఇలా అన్నారు—

"భారతదేశ అభ్యుదయానికి తీవ్రకృషి చేస్తున్న డాక్టర్ హుస్సేన్ హఠాన్మరణం గురించిన వార్త విని మేము విషాదానికి గురయ్యాం.

'గొప్ప రాజకీయవేత్త యుగోస్లావియాకు అత్యంత ఆప్త మిత్రుడు అయిన డాక్టర్ జాకిర్ మృతిపట్ల తీవ్ర సంతాపం వ్యక్తం చేస్తున్నాం'.

## జపాన్ చక్రవర్తి

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి సంతాపం తెలియజేస్తూ జపాన్ చక్రవర్తి హిరోహిట్, భారత తాత్కాలిక రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరికి సందేశం పంపారు.

## పాక్ రేడియో

స్వర్గీయ డాక్టర్ జాకిర్ హుస్సేన్ ప్రముఖ విద్యావేత్తలనీ, రాజనీతిజ్ఞుడనీ పాకిస్తాన్ రేడియో జోహార్లు అర్పించింది.

## పాకిస్తాన్ దినపత్రిక

"డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతి కేవలం భారత ప్రజలకే కాకుండా, మొత్తం ప్రపంచ ప్రజలకే తీవ్ర సంతాపాన్ని కలిగిస్తున్నది" అని పాకిస్తాన్ దినపత్రిక "మార్నింగ్ న్యూస్" సంపాదకీయం వ్రాసింది.

డాక్టర్ జాకిర్ హుస్సేన్ తన జీవితాన్ని న్యూఢిల్లీలో చిన్న స్కూలుటీచరుగా ప్రారంభించి, తన జీతాన్నికూడా పేద విద్యార్థుల విద్యకోసం విరాళంగా ఇచ్చారని 'మార్నింగ్ న్యూస్' వివరించింది.

"ఆయన నిరాడంబర జీవి. ఉన్నత ఆశయాలు కలవారు. పాకిస్తానులో ప్రజలంతా ఆయన మృతికి ప్రగాఢ సంతాపం వెలిబుచ్చుతున్నారు" అని మార్నింగ్ న్యూస్ పేర్కొన్నది.

## రాయబారులు

భారత విదేశాంగమంత్రి శ్రీ దినేష్‌సింగ్‌కు అమెరికా దౌత్యాధికారి విలియమ్ వెదర్బీస్ ఒక సంతాప సందేశం పంపుతూ, డా. హుస్సేన్ మరణవార్త అమెరికా రాయబార కార్యాలయానికి, భారతదేశంలోని అమెరికా దేశస్థులకు తీవ్ర సంతాపం కలిగించిందని పేర్కొన్నారు.

డాక్టర్ హుస్సేన్ మృతివార్త విని తాము దిగ్భ్రాంతి చెందినట్లు యుగోస్లావియా రాయబారి బ్లాజవిక్ తమ సందేశంలో పేర్కొన్నారు.

బ్రిటిష్ రాయబారి మారిస్‌జేమ్స్, తాత్కాలిక రాష్ట్రపతి గిరికి ఒక సందేశం పంపుతూ, డా. హుస్సేన్ మరణవార్త విని తాము ఎంతో కలతచెందామని అన్నారు.

భారత రాష్ట్రపతి డా. హుస్సేన్ మృతికి సంతాపం ప్రకటించటానికి రాష్ట్రపతిభవన్‌కు వచ్చిన రాయబారులలో మొదటివారు ఫ్రాన్స్ రాయబారి.

## బి. బి. సి. ప్రసారం

విద్యారంగంలో డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మార్గదర్శి అని బి. బి. సి. రేడియో వర్ణించింది. రాష్ట్రపతి డాక్టర్ హుస్సేన్ మరణవార్తను ప్రచారంచేస్తూ, వక్తగా, రచయితగా ఆయన పేరు సంపాదించారనికూడా వర్ణించింది.

## సింహళ పార్లమెంటు

"డాక్టర్ జాకిర్ హుస్సేన్ హిందూ—ముస్లిం సమైక్యతకు చిహ్నం. అందరి ఆదరాభిమానాలను పొందిన రాజనీతిజ్ఞుడు. శాంతికాముకుడైన వ్యక్తి. గొప్ప పండితుడు" అని సింహళ పార్లమెంటు శ్రద్ధాంజలి ఘటించింది.

డాక్టర్ జాకిర్ హుస్సేన్ హఠాన్మరణానికి ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తంచేస్తూ ఒక తీర్మానాన్ని కూడా పార్లమెంటు ఆమోదించింది.

"గొప్ప విద్యావేత్త మానవతావాది" అని పార్లమెంటులోని పలువురు నాయకులు జోహార్లు అర్పించారు.

## ట్రినిడాడ్ ప్రజలు

ట్రినిడాడ్‌లోను జార్జిటౌన్‌లోను డాక్టర్ హుస్సేన్ మృతికి సంతాపం వెలిబుచ్చుతూ ఇండియన్ హైకమిషన్ కార్యాలయాలవద్ద సంతాప పుస్తకాల్లో వందలాది మంది ప్రజలు సంతకాలు చేశారు.

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి రెండు వారాల కాలం సంతాప దినాలుగా ట్రినిడాడ్ ప్రకటించింది.

ట్రినిడాడ్‌లోను, గయానాలోను సుమారు ఏడున్నర లక్షల మంది భారతీయులున్నారు.

## భూటాన్‌లో

భూటాన్‌లోని చర్చిలలో స్వర్గీయ డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆత్మశాంతి కోసం ప్రార్థనలు జరిగినవి.

రాష్ట్రపతి ఆకస్మిక మృతికి ప్రగాఢ సంతాపం వ్యక్తంచేస్తూ భూటాన్ రాజు, భూటాన్ ప్రభుత్వ హోంమంత్రి ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధికి సంతాప సందేశాలు పంపారు.

దింపూలో వున్న భారతీయ స్పెషల్ ఆఫీసర్ కార్యాలయంలో సంతాప సభ జరిగింది. డాక్టర్ హుస్సేన్ స్మృతికి పలువురు నివాళులర్పించారు.

## సోవియెట్ ఎంబసీ ప్రత్యేక ప్రచురణలు

డాక్టర్ జాకిర్ హుస్సేన్ జీవిత విశేషాలకు సంబంధించి సోవియెట్ ఎంబసీ నిన్న ప్రత్యేక ప్రచురణలను వెలువరించింది.

స్వర్గీయ డాక్టర్ జాకిర్ హుస్సేన్ చిత్రాన్ని నలుపు అంచులతో సోవియెట్ ప్రచురించింది. గత సంవత్సరం డాక్టర్ హుస్సేన్ సోవియెట్ యూనియన్‌లో పర్యటించినప్పుడు చేసిన ప్రసంగాలను కూడా సోవియెట్ ఎంబసీ నిన్న ప్రకటించింది.

## గాంగ్‌టక్‌లో సంతాప సభ

డాక్టర్ జాకిర్ హుస్సేన్ అంత్యక్రియల సందర్భంగా గాంగ్‌టక్‌లోని భారతీయ సాంస్కృతిక కేంద్రం కార్యాలయంలో ప్రార్థనా సమావేశం జరిగింది. భూటాన్, సిక్కింలలోని ఇండియన్ పొలిటికల్ ఆఫీసర్ కూడా హాజరయ్యారు. సిక్కింలోని ప్రభుత్వ కార్యాలయాలు వాణిజ్య సంస్థలు దుకాణాలు డాక్టర్ జాకిర్ హుస్సేన్ స్మృతికి గౌరవార్థం మూసి వేశారు.

## ఎమెన్ రిపబ్లిక్‌లో ఏడురోజులు సంతాప దినాలుగా ప్రకటన

డాక్టర్ జాకిర్ హుస్సేన్ హఠాన్మరణానికి సంతాప సూచకంగా ఏడు రోజులు సంతాపదినాలుగా దక్షిణ ఎమెన్ రిపబ్లిక్ ప్రకటించింది.

ఎమెన్ ప్రధాని అబ్దుల్ లతీఫ్, భారతీయ రాయబార కార్యాలయానికి వెళ్ళి, డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియజేశారు.

## సుడాన్‌లో సంతాప దినాలు

సుడాన్ ప్రభుత్వం డాక్టర్ హుస్సేన్ మృతికి సంతాప సూచకంగా తమ దేశంలో మూడు రోజులు సంతాప దినాలుగా ప్రకటించింది. సూడాన్ ప్రభుత్వ ప్రెసిడెంట్ ఇస్మాయిల్ అజారి, భారతప్రభుత్వానికి ఒక సంతాపసందేశం పంపారు.

## ప్రపంచ విజ్ఞాన సమితి

పేరిస్‌లో సమావేశం జరిపి ప్రపంచ విజ్ఞానసంస్థ కార్యవర్గం, డాక్టర్ హుస్సేన్‌కు శ్రద్ధాంజలి ఘటించింది.

డాక్టర్ హుస్సేన్ ప్రపంచ విజ్ఞానసంస్థ ఆదర్శాలకు ప్రతీక అని కార్యవర్గసంఘం అధ్యక్షుడు ఫ్రాంక్ పాంపే అభివర్ణించారు. ఆయన ఉన్నత విద్యావేత్త అని డైరెక్టర్‌జనరల్ రేమ మాహ్యూ పేర్కొన్నారు.

## సిక్కిం జాతీయ కాంగ్రెస్

సిక్కిం జాతీయ కాంగ్రెస్ డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి సంతాపం ప్రకటిస్తూ, డాక్టర్ హుస్సేన్ దయాస్వరూపులనీ, వినమ్ర స్వభావులనీ, అఖిలమానవాళి మిత్రులనీ కీర్తించింది.

## అరబ్ రిపబ్లిక్ అగ్రనాయకులు

అరబ్ రిపబ్లిక్ అగ్రనాయకులు పలువురు కెయిరోలోని భారత దౌత్యకార్యాలయానికి విచ్చేసి డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతిపట్ల తమ సంతాపం వ్యక్తపరచి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన రిజిష్టర్‌లో సంతకాలు చేశారు.

# భారతప్రజల ఆవేదన...

## ఉప ప్రధాని మొరార్జీదేశాయ్

1946 లో కేంద్రంలో కాంగ్రెస్ — ముస్లిం లీగ్ సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడినప్పుడు డాక్టర్ జాకిర్ హుస్సేన్‌కు మంత్రిపదవి ఇవ్వడానికి సంసిద్ధత తెలపగా, ఆయన మంత్రి పదవిని చేపట్టడానికి వ్యతిరేకించి, విద్యారంగంలో తన కృషిని కొనసాగించడానికి నిర్ణయించుకున్నారు.

ఉపప్రధానమంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ ఆకాశవాణిలో ప్రసంగించి, స్వర్గీయ రాష్ట్రపతి జాకిర్‌హుస్సేన్‌కు జోహార్లర్పిస్తూ పై విషయం ప్రస్తావించారు.

భారత రిపబ్లిక్ రాజ్యాంగ అధినేతగా వుండడానికి డాక్టర్ హుస్సేన్ కంటె అధిక అర్హతలు కల వ్యక్తి మరొకరు లేరని దేశాయ్ అన్నారు.

మత ప్రసక్తిలేని లౌకిక వ్యవస్థకు ఆయన ప్రతీక అనీ, ఈ సిద్ధాంతానికి ఆయన మార్గదర్శి గావడమే జాతికి ఆయన చేసిన మహోన్నత సేవ అనీ ఆయన పేర్కొన్నారు.

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ భారతీయుడు కావడం, ముస్లిం కావడం గర్వించదగినదని, ఆయన దేశభక్తి, ఆయన మతం, ఆయన లౌకిక విధానంకూడా గర్వకారణములైన విషయాలని ఉపప్రధాని అన్నారు.

మతానికి నిజమైన అర్థాన్ని పాటించిన వ్యక్తి డాక్టర్ హుస్సేన్ అనీ, మత, వర్గ,విభేదాలకు అతీతంగా ఆయన మొదట తాను భారత్ పౌరుడన్న దృష్టితో వ్యవహరించారని, మహోన్నతమైన మానవతా విలువలు ఆయనకు అత్యంత ప్రియమైనవని శ్రీ దేశాయ్ అన్నారు.

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ అస్తమయంవల్ల దేశం ప్రతిభావంతుడైన పుత్రుని కోల్పోయిందని, ప్రపంచ వ్యాప్తంగా స్వేచ్ఛా ప్రియులంతా గొప్ప యోధుని కోల్పోయారని శ్రీ దేశాయ్ జోహార్లర్పించారు.

మానవాళిపట్ల ప్రగాఢ ప్రేమ, వారి సంక్షేమ సంతోషాల పట్ల ప్రగాఢ ఆసక్తి కలిగివుండే అరుదైన వ్యక్తులలో డాక్టర్‌జాకిర్ హుస్సేన్ ఒకరని మొరార్జీదేశాయ్ పేర్కొన్నారు.

దేశజీవితాన్ని సుసంపన్నంచేయడానికి, ముఖ్యంగా విద్యారంగం అభివృద్ధికి, ఆయనచేసిన అమూల్యమైన సేవలను ప్రతిభావంతము, సుదీర్ఘము అయిన ఆయనజీవితం గుర్తుకు తెస్తుందనీ, విద్యారంగంపై ఆయన తమవ్యక్తిత్వపుముద్రవేశారని శ్రీ దేశాయ్ అన్నారు. భారతీయ మతాతీత తత్వాన్ని పెంచి పోషించడంలో ఆయన చూపిన ఏకీకరణ ప్రభావం ఆయన సేవలన్నింటిలోను గొప్పదని శ్రీ దేశాయ్ చెప్పారు.

డాక్టర్ హుస్సేన్ ఆచరణ శీలమైన విజ్ఞత, మహోన్నత పాండితి కలవారని ఉప ప్రధాని అన్నారు. ఆయన వినయసంపద కలవారని, పవిత్రుడని శ్రీ మొరార్జీదేశాయ్ పేర్కొన్నారు.

జాకిర్ హుస్సేన్‌ను సన్నిహితంగా తెలుసుకొనే భాగ్యం తమకు కల్గిందని; ఆయన అభిరుచుల్లోగల ఔదార్యం, భారత్ భవితవ్యంలో ఆయనకుగల అకుంఠితమైన విశ్వాసం ఆయనపట్ల తమకెంతో గౌరవభావాన్ని కలిగించినవని ఉప ప్రధాని చెప్పారు. ఆయన మృతివల్ల తాము ఒక గొప్ప మిత్రుడ్ని, దేశం ఒక గొప్ప వ్యక్తిని కోల్పోవడం జరిగిందని శ్రీ దేశాయ్ పేర్కొన్నారు.

## ప్రధాన న్యాయమూర్తి

డాక్టర్ హుస్సేన్ మృతి వలన భారతదేశం అత్యుత్తమ పుత్రులలో ఒకరిని కోల్పోయిందని ప్రధాన న్యాయమూర్తి శ్రీహిదయతుల్లా తమ సంతాపం వ్యక్తం చేశారు.

ఆయన ప్రజలందరి మన్నన పొందిన అత్యుత్తమ వ్యక్తి అనీ; విద్యావేత్త, స్నేహశీలి అనీ ప్రధానన్యాయమూర్తి అభివర్ణిస్తూ, అంతటి మహనీయునికి వారసుడుగా తగిన వ్యక్తిని ఎన్నుకొనటం చాలా కష్టం అని అన్నారు.

## డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్

"డాక్టర్ జాకిర్ సాహెబ్ ఆకస్మికంగా కన్నుమూశారని విని నేను నిర్ఘాంతపోయాను. నాకు ఎక్కడలేని దుఃఖం ముంచుకు వచ్చింది. ఆయన చాలా పెద్దమనిషి. మర్యాదస్తుడు. ప్రసిద్ధమైన విద్యావేత్త. స్వయం కృషితో పైకి వచ్చిన వ్యక్తి ఆయన. వారి కుటుంబానికి నా ప్రగాఢ సానుభూతి" అని మాజీ రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ తమ సందేశంలో పేర్కొన్నారు.

తన విచారాన్ని తెలుపుతూ వ్యక్తిగతంగా, బేగం హుస్సేన్‌కు కూడా ఆయన ఒక సందేశం పంపారు.

## రాజాజీ

"తక్కినభారత దేశంతో పాటు నేనూ, స్వర్గీయ రాష్ట్రపతికి నా భక్తిపూర్వకమైన భాష్పాంజలి ఘటిస్తున్నాను. గాంధీజీ స్వాతంత్ర్యోద్యమంలో, ఆయనకు అండగా అలీ సోదరులు ఉద్యమంలో చేర్చిన తొలి స్వాతంత్ర్య యోధులలో శ్రీ జాకిర్ హుస్సేన్ ఒకరు. భారత దేశంలో ఆయనవంటి ఉత్తముడు లేడు" అని రాజాజీ తనజోహార్లు అర్పించారు.

## జి. ఎల్. నందా

మన ఆశలనూ, ఆకాంక్షలనూ, జాతీయసమైక్యతను డాక్టర్ హుస్సేన్ ప్రతిబింబమని శ్రీ గుల్జారీలాల్ నందా పేర్కొన్నారు. ఆయన సలహాలు ఎంతో అవసరమైన ఈ సమయంలో ఆయన లేకుండా పోవడం దేశానికి తీరని నష్టమని శ్రీ నందా అన్నారు.

## బి. ఆర్. భగత్

"డాక్టర్ హుస్సేన్ మానవ ప్రపంచంలో అపురూపమైన వ్యక్తి. ప్రజల సంక్షేమాన్ని ఆయన ఎంతగా అభిలషించేవారో అంతగా వారిని ప్రేమించేవారు. ఇది మాటలతో తెల్పుటకు అలవికాని విఘాతం. ఆయనకుగల విజ్ఞానాన్ని సాధారణ వ్యక్తుల ప్రయోజనం కోసం తమ రచనల్లో అభివ్యక్తం చేశారు. జాతిపితకు, డాక్టర్ హుస్సేన్ వాస్తవమైన అనుచరులు. ఈ లోటు పూరించటం దుష్కరం" అని విదేశీ వాణిజ్య సప్లయి శాఖామంత్రి శ్రీ బి. ఆర్. భగత్ స్వర్గీయ రాష్ట్రపతికి జోహారులర్పించారు.

## బీహార్ ముఖ్యమంత్రి

డాక్టర్ జాకిర్ హుస్సేన్ హఠాన్మరణం బీహార్ ప్రజలకు దిగ్భ్రాంతి కలిగించిందని బీహార్ ముఖ్యమంత్రి సర్దార్ హరిహర్‌సింగ్ ఒక సందేశంలో పేర్కొన్నారు. డాక్టర్ హుస్సేన్ మృతివల్ల దేశం ప్రతిభావంతుడైన విద్యావేత్తను, నిజమైన గాంధేయవాదిని, నిజమైన ప్రజాస్వామికవాదిని కోల్పోయిందని ఆయన చెప్పారు.

## చవాన్

రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆకస్మికంగా మరణించారన్న విషాదవార్త తనను దిగ్భ్రాంతిలో ముంచి వేసినదని కేంద్ర హోంమంత్రి శ్రీ వై. బి. చవన్ అన్నారు.

శ్రీ చవన్ ఇలా అన్నారు: "భారత సంస్కృతీ సంప్రదాయాలు మూర్తీభవించిన వ్యక్తి డాక్టర్ జాకిర్ హుస్సేన్, ఆయనలో మన దేశ ఉన్నతాశయాలన్నీ మేళవించి ఉండడం మనం చూస్తాము. ఆయనలోని మానవత్వం, గొప్ప పాండిత్యం, వినయ విధేయతలు, ప్రశాంత గంభీరత—ఇవే ఆయనను సకల ప్రజానీకానికీ స్నేహితునిగా చేశాయి. ఆయన అగ్రశ్రేణికి చెందిన విద్యావేత్త, ఉన్నత సంప్రదాయాలుగల గాంధేయవాది.

ఈ క్లిష్ట సమయంలో ఆయన సలహాలు, మార్గదర్శకత్వం మనకెంతో అవసరమై ఉండగా ఆయన మనలను వీడి పోయారు. ఇది జాతికంతకూ తీరని నష్టం"

## ఎన్. జి. రంగా

డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆకస్మిక మృతికి స్వతంత్రపార్టీ అధ్యక్షుడు ప్రొఫెసర్ ఎన్. జి. రంగా సంతాపం వెలిబుచ్చుతూ, దేశం మరొక దేశభక్తుణ్ణి కోల్పోయిందని అన్నారు.

"ప్రాథమిక విద్యావిధానాన్ని రూపొందించడంలో డాక్టర్ జాకిర్ హుస్సేన్ గాంధీకి తోడ్పడ్డారు."

"కవులు, రచయితలు, కళాకారుల ప్రతిభను గుర్తించడానికి ఆయన ఎల్లప్పుడూ సంసిద్ధులై ఉండేవారు. జాతీయ సమైక్యత, వర్గ సామరస్య సాధనలో గావించిన విశిష్ట సేవకు ఆయనకు జాతి సర్వదా కృతజ్ఞత వెల్లడిస్తూంటుంది" అని శ్రీ రంగా అన్నారు. "మనం ఆకర్షణీయమైన ఒక స్ఫుర ద్రూపిని కోల్పోయాం" అని కూడా శ్రీ రంగా అన్నారు.

## ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్

సమైక్యత, సంస్కృతి, విద్య, పారిశ్రామికాభివృద్ధికి డాక్టర్ జాకిర్ హుస్సేన్ తనను తాను అంకితం చేసుకున్నారని కేంద్ర పారిశ్రామికాభివృద్ధి మంత్రి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ అన్నారు. ఆయన లేని లోటును పూరించడం చాలా కష్టం అని ఆయన తన విచారాన్ని వ్యక్తంచేసారు.

"భారత ప్రజలకు శ్రీ హుస్సేన్ మృతి విషాదకరమయింది. ఆయన మరణం హఠాత్తుగా సంభవించింది" అని ఆయన అన్నారు.

## ఖాదిల్కర్

శ్రీ ఖాదిల్కర్, రాష్ట్రపతి మృతికి తన సంతాపాన్ని ప్రకటిస్తూ జాతికి ఆయన అవసరం ఏర్పడివున్న సమయంలో ఆయన పరమపదించారని అన్నారు.

"రాజ్యాంగాన్ని దృష్టిలో పెట్టుకుని ఆయన పనిచేశారు. మృత్యువు మరొక మేధావిని, గాంధీజీ అనుచరులలో ఒకరిని మననుంచి విడదీసింద"ని ఆయన అన్నారు.

## కె. సి. రెడ్డి

మధ్యప్రదేశ్ గవర్నర్ శ్రీ కె. సి. రెడ్డి ఒక సంతాప సందేశంలో డాక్టర్ హుస్సేన్ మృతి తనకు దిగ్భ్రాంతి కలిగించిందని అన్నారు. ఆయన నిరాడంబరమైన వ్యక్తి. "తాను ఎన్నుకొన్న విద్యారంగానికి ఆయన తనను తాను అంకితం చేసుకొన్నారు. గవర్నరుగా, ఉపరాష్ట్రపతిగా, భారత రాష్ట్రపతిగా ఆయన ముఖ్య

ఆనకట్ట దృశ్యం చూస్తూ..





నాగార్జున సాగర్ సందర్శన



ఎడమ కాలువ వద్ద

## *1967* సెప్టెంబరు *6* వ తేదీన రాష్ట్రపతి ఃః

విజిటర్స్ పుస్తకంలో ఆయన యిలా వ్రాశారు :

"ప్రాజెక్టు క్రింద యింకా మిగిలివున్న పని పూర్తికావడ
సిస్తున్నాను". "దూరదృష్టితో యోచించి, సామర్థ్య
కారణము. అనేక శతాబ్దాలు విద్యా, విజ్ఞానాలకు నిలయ
మాటలలో యీ "నవభారత ప్రసిద్ధ యాత్రాస్థలం' సందర్శి

హైదరాబాదులో ఐ. వాన్. ఏ. ఉరుదు సందర్శన





భారత వైమానిక దళం అకాడమి శంకుస్థాపన

ఎన్. సి. సి. విన్యాసంలో



## ాకిర్ హుస్సేన్ నాగార్జున సాగర్ సందర్శించారు.

నికి అవసరమైన వసరులు సమకూర్చబడతాయని నేను విశ్వ
ంతో నిర్వహించిన యీ ప్రాజెక్టు జాతిప్రజలందరికీ గర్వ
మైన యీ ప్రదేశంలో నిర్మించిన యీ ప్రాజెక్టును — స్వహా
స్తే హృదయం ఉప్పొంగుతుంది"



రీజినల్ రీసర్చ్ లేబరేటరీ సందర్శన

స్వహా రైఫిల్ శిక్షణ-కేంద్రం



మైన పదవులలో వున్నారు. ఆయనలోని నిరాడంబరత్వం, గొప్ప ఆకర్షణ, లోతైన సంస్కృతి అందరికీ ఆయనను సన్నిహితుని చేశాయి. ఆయన మృతి దేశానికి తీరని లోటును కలిగిస్తోంది. నేను నా సన్నిహిత మిత్రుని కోల్పోయాను" అని ఆయన అన్నారు.

## మైసూరు ముఖ్యమంత్రి

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ దృక్పథంలోని ఔదార్యం, ప్రశాంత వైఖరి, అమితమైన దేశభక్తి, ప్రపంచంలో మనదేశాన్ని గొప్పచేసినవని మైసూరు ముఖ్యమంత్రి శ్రీ వీరేంద్రపాటిల్ పేర్కొన్నారు.

మైసూరు గవర్నర్ శ్రీ జి. ఎస్. పథక్ శ్రీమతి హుస్సేన్‌కు ఒక తంతి పంపుతూ, భారతమాత తనకు అత్యంత ప్రియతములు, దేశభక్తులు అయిన పుత్రులలో ఒకరిని కోల్పోయిందని పేర్కొన్నారు. అపారమైన ఈ నష్టాన్ని భరించే శక్తి శ్రీమతి హుస్సేన్‌కు, యితర కుటుంబ సభ్యులకు భగవంతుడు ప్రసాదించాలని కోరుతున్నామని ఆయన అన్నారు.

పార్లమెంటు సభ్యుడు శ్రీచంద్రశేఖర్, డాక్టర్‌హుస్సేన్ మృతివార్తవిని దిగ్భ్రాంతి వ్యక్తం చేశారు.

మైసూరు ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ అల్వా తమ సంతాపం ప్రకటిస్తూ, డాక్టర్‌జాకిర్‌హుస్సేన్ గొప్ప జిజ్ఞాసువు, రచయిత, స్వాతంత్ర్య యోధుడు అని పేర్కొన్నారు.

## పాండిచ్చేరి ముఖ్యమంత్రి

డాక్టర్ జాకిర్ హుస్సేన్ దేశభక్తుడు, నాయకుడు, రాజనీతిజ్ఞుడు, ఘనమైన లక్ష్యాలకు జీవితం అంకితం చేసిన ఘనమైన కార్యకర్తఅని పాండిచ్చేరి ముఖ్యమంత్రి శ్రీ ఫరూ కుమారికర్ శ్లాఘించారు.

## హితేంద్ర దేశాయ్

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతివల్ల దేశం వివేకవంతుడైన ఒక మతాతీతవాదిని కోల్పోయిందని గుజరాత్ ముఖ్యమంత్రి శ్రీ హితేంద్ర దేశాయ్ పేర్కొన్నారు.

డా॥ హుస్సేన్ అకుంఠిత దేశభక్తుడు, గొప్ప పండితుడు మాత్రమేగాక గొప్ప మానవుడని గుజరాత్ గవర్నర్ శ్రీ శ్రీమన్నారాయణ్ పేర్కొన్నారు.

## ఒరిస్సా ఉప ముఖ్యమంత్రి

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతి భారత్‌కే గాక, శాంతికాముక ప్రపంచానికంతటికి దిగ్భ్రాంతికరమని ఒరిస్సా ఉపముఖ్యమంత్రి శ్రీ ప్రధాన్ అన్నారు. జాతీయ భావసమైక్యతకు ఆయన రాష్ట్రపతి పదవి ఒక చిహ్నంగా వుండేదని శ్రీ ప్రధాన్ అన్నారు. ఆయన కలలుగన్న విద్యావ్యవస్థను అనుసరిస్తే, విద్యావంతుల నిరుద్యోగసమస్యలు పరిష్కరించవచ్చునని శ్రీ ప్రధాన్ చెప్పారు.

## పంజాబ్ ముఖ్యమంత్రి

స్వాతంత్రోద్యమంలో అగ్రగాములయిన వారితరం, డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతితో అంతరించిందని పంజాబ్ ముఖ్యమంత్రి శ్రీ గుర్నాంసింగ్ పేర్కొన్నారు.

అంతటి దయార్ద్ర హృదయం, సద్బుద్ధిగల మరొక వ్యక్తిని చూడడం అసాధ్యమని పంజాబ్ గవర్నర్ శ్రీ పవాటే పేర్కొన్నారు. డాక్టర్ జాకిర్ హుస్సేన్ నిరాడంబరుడు, దైవభక్తిపరాయణుడు. పేద ప్రజల ఉద్ధరణకు ఆయన యావచ్ఛక్తితో కృషిచేసేవారని శ్రీ పవాటే చెప్పారు.

డాక్టర్ హుస్సేన్ మృతివల్ల ఏర్పడిన లోటును భర్తీ చేయడం కష్టమని హర్యానాగవర్నర్ శ్రీ చక్రవర్తి పేర్కొన్నారు.

## మహారాష్ట్ర పి. సి. సి. అధ్యక్షుడు

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ భారతీయ సంస్కృతికి, మతాతీత వ్యవస్థకు చిహ్నమని, ఆయన మృతివల్ల దేశానికి తీరని నష్టం సంభవించిందని మహారాష్ట్ర పి.సి.సి. అధ్యక్షుడు పేర్కొన్నారు.

## ఎస్. కె. పాటిల్

గత అయిదు సంవత్సరాలుగా దేశం ఎదుర్కొంటున్న తీవ్రనష్టాలకు డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతివల్ల మరొకటి చేరినట్లయిందని శ్రీ ఎస్.కె. ప్యాటిల్ పేర్కొన్నారు. దేశానికి యింతకన్నా విషాదకరమైన సంఘటన ఉండదన్నారు.

## హిమాచల్ ప్రదేశ్ లెఫ్టినెంట్ గవర్నర్

డాక్టర్ జాకిర్ హుస్సేన్ హఠాన్మరణం తమకు ప్రగాఢ విచారం కలిగించిందని, హిమాచల్ ప్రదేశ్ లెఫ్టినెంట్ గవర్నర్ శ్రీ కె. బహదూర్‌సింగ్ పేర్కొన్నారు.

రాష్ట్రపతి మృతి వల్ల జాతీయ జీవితంలో తీవ్రమైన శూన్యం ఏర్పడిందని ముఖ్యమంత్రి డాక్టర్ వై. ఎస్. పార్మర్ అన్నారు.

## వి. కె. ఆర్. వి. రావు

"డాక్టర్ జాకిర్ హుస్సేన్ నాకు గత 30 సంవత్సరాలుగా మిత్రుడు. ఆయన పెద్ద మనిషి గొప్పవిద్యావేత్త" అని కేంద్ర విద్యామంత్రి డాక్టర్ వి.కె.ఆర్.వి. రావు తమ గాఢ సంతాపం తెలుపుతూ అన్నారు.

## కె. హనుమంతయ్య

డాక్టర్ హుస్సేన్‌కు గాంధీ ధోరణి వున్నదని, ప్రపంచ వ్యాప్తంగా ఆయనను అందరూ ప్రేమించారని, ఆయన మరణంతో దేశనాయకుల శ్రేణిలో ఒక అగాధం ఏర్పడిందని పరిపాలనా సంస్కరణల సంఘం అధ్యక్షుడు శ్రీ కె. హనుమంతయ్య అన్నారు.

## ఆచార్య కృపలానీ

"డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతితో దేశం ఒక గొప్ప పండితుని, విద్యాధికుని కోల్పోయింది"—అని ఆచార్య కృపలానీ అన్నారు.

"జాతి అంతా ఆయనపట్ల విశిష్టమైన గౌరవ ప్రపత్తులు వ్యక్తం చేసింది. రాష్ట్రపతిగా ఆయనను ప్రపంచంఅంతా గౌరవించింది" అని ఆయన అన్నారు.

## డాక్టర్ కరణ్‌సింగ్

"జాకిర్ హుస్సేన్ సాహెబ్ మరణవార్త దిగ్భ్రాంతిని కలిగించింది. అస్సాం, నాగాలాండ్‌లకు ఆయన బయలుదేరే ముందు రోజున నాకు ఆయనను కలుసుకొనే అవకాశం లభించింది. అంతశ్రమతో కూడిన ప్రయాణాన్ని గురించి నేను ఆందోళన వెలిబుచ్చగానే "నా ప్రజలు నేను వస్తానని ఎదురుచూస్తున్నారు" అని డాక్టర్ హుస్సేన్ నాతో అన్నారు - అని శ్రీ కరణ్‌సింగ్ ఢిల్లీకి బయలుదేరే ముందు అందజేసిన సానుభూతి సందేశంలో పేర్కొన్నారు.

## డాక్టర్ సత్యనారాయణ సిన్హా

''ఔదార్యం, మంచితనం డాక్టర్ హుస్సేనులో నిబిడీకృతమై వున్నాయి. దేశం ఈనాడు తన ప్రథమ పౌరుని, గొప్ప రాజనీతిజ్ఞుని కోల్పోయింది" అని కేంద్ర సమాచారశాఖ మంత్రి డాక్టర్ సత్యనారాయణసిన్హా ఒక సంతాప సందేశంలో పేర్కొన్నారు.

## భగవాన్ సహాయ్

కాశ్మీర్ గవర్నర్ శ్రీ భగవాన్ సహాయ్ డాక్టర్ జాకిర్ హుస్సేన్ బహుముఖ ప్రజ్ఞ గురించి మాట్లాడుతూ అమరులవలె ఆయన ఉత్కృష్ట గుణాలతో తయారైన వ్యక్తి అన్నారు. విద్యారంగానికి ఆయన చేసిన సేవలు శ్రీ సహాయ్ ప్రస్తుతించారు.

ఆయన వ్యక్తిత్వంలో రెండు మహోన్నతమైన ఆదర్శాలు సహన సౌశీల్యం, మత ప్రసక్తి రహితమైన తత్వం వున్నాయని ఆయన అన్నారు.

## దామోదరలాల్ వ్యాస్

భారత రాష్ట్రపతిగా విదేశాలలో డాక్టర్ హుస్సేన్ జాతి గౌరవాన్ని మరింతగా పెంపొందింపచేశారని రాజస్థాన్ హోం మంత్రి శ్రీ దామోదరలాల్ వ్యాస్ అన్నారు.

రాష్ట్రపతి మరణం దేశానికి తీరని లోటని రాజస్థాన్ శాసనసభ స్పీకరు శ్రీ ఎన్. ఎన్. ఆచార్య అన్నారు.

## చంద్రభాను గుప్త

డాక్టర్ హుస్సేన్ మరణంతో ''మనం ఒక గొప్ప జాతీయుని, గాంధేయుని, విద్యావేత్తను, రాజనీతిజ్ఞుని, మత రహిత తత్వ ప్రబోధకుని కోల్పోయాము'' అని ఉత్తర ప్రదేశ్ ముఖ్య మంత్రి శ్రీ చంద్రభాను గుప్త అన్నారు.

## గజేంద్ర గడ్కర్

డాక్టర్ హుస్సేన్ గొప్ప సహన శీలి అనీ, సాధారణ స్త్రీ, పురుషుల అభివృద్ధికోసం ఆయన కృషిచేశారనీ, ఆయన మృతి వల్ల కలిగిన దిగ్భ్రాంతినుంచి కోలుకొనడానికి దేశానికి ఎంతో కాలం పడుతుందనీ బొంబాయి విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులు డాక్టర్ పి. బి. గజేంద్రగడ్కర్ అన్నారు.

## డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి

ఉత్తరప్రదేశ్ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి తన సంతాపాన్ని ప్రకటిస్తూ బేగం జాకిర్‌హుస్సేన్‌కు ఒక టెలిగ్రాం పంపారు.

''రాష్ట్రపతి డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మరణవార్త రైలులో ప్రయాణం చేస్తుండగానే నాకు అందజేసినప్పుడు దిగ్భ్రాంతుడ నయ్యాను. ఇలాజరుగుతుందని ఎన్నడూ అనుకోలేదు. ఆయన ప్రముఖ విద్యావేత్త, పండితుడు, గాంధీజీ ముఖ్యసహచరులలో ఒకరు. ఉత్తరప్రదేశ్ ప్రజల తరపున, నాతరపున మీకు నా ప్రగాఢ సంతాపాన్ని తెలుపుకుంటున్నాను.'' అని డాక్టర్ గోపాలరెడ్డి తన సందేశంలో పేర్కొన్నారు.

## కె. పి. ఎస్. మీనన్

రాష్ట్రపతి మృతివార్త వినగానే రష్యాలో మాజీ భారత రాయబారి శ్రీ కె. పి. ఎస్. మీనన్ గాఢ విచారం తెలుపుతూ ఈ క్రింది విధంగా ప్రకటించారు.

"శ్రీ హుస్సేన్ దేశ ప్రజలందరిచేత గౌరవించబడిన వ్యక్తి. ఈయనను రాష్ట్రపతిగా కంటే, గొప్ప విద్యావేత్తగాను, పెద్ద మనిషిగాను, గాంధీజీకి నిజమైన శిష్యుడుగాను దేశంయావత్తు గౌరవించింది. డాక్టర్ హుస్సేన్ మన దేశంలో విద్యారంగం అభివృద్ధికి చేసిన కృషిని వర్ణించడం శక్యంకాదు.

వీరి నిర్యాణంవల్ల భారతదేశం ఒక గొప్ప విద్యావేత్తను, గొప్ప వ్యక్తిని కోల్పోయింది. ఇది తీరని లోటు".

## టి. వి. థామస్

కేరళ పరిశ్రమల మంత్రి శ్రీ టి. వి. థామస్ ఒక ప్రకటన చేస్తూ రాష్ట్రపతి ఆకస్మికంగా మరణించారన్న వార్త విని విస్మయం చెందానని; స్వాతంత్ర్యయోధుడుగా, విద్యావేత్తగా ఆయన సేవలను దేశం విస్మరించలేదని అన్నారు.

## ఫ్రాంక్ ఆంథోనీ

రాష్ట్రపతి మరణంపట్ల పార్లమెంటు సభ్యుడు శ్రీ ఫ్రాంక్ ఆంథోనీ విచారాన్ని వ్యక్తంచేస్తూ, భారత లౌకిక విధానానికి ప్రతిరూపమైన వ్యక్తిని కోల్పోయామన్నారు. ఆయన సమగ్ర భారత దేశ సంస్కృతికికూడా ప్రతిబింబమన్నారు.

## తమిళనాడు ముఖ్యమంత్రి

తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి తమ సంతాపాన్ని వ్యక్తంచేస్తూ, ఆయన నిగర్వి, ప్రజ్ఞానిధి అన్నారు. ఆయన ఉదాత్త స్వాతంత్ర్యయోధులు. గాంధీజీ నిరాడంబరతకు నిజమైన అనుచరులు, హిందూ_ముస్లిం ఐకమత్యానికి చిహ్నం అన్నారు. ఆయన మరణానికి దేశం దిగ్భ్రాంతి చెందిందనీ, ఆయన కలకాలం జ్ఞప్తి ఉంటారనీ అన్నారు.

## ఎస్. ఎన్. ద్వివేదీ

రాష్ట్రపతి మృతి దేశానికి పెద్దదెబ్బ అని లోకసభలో పి. ఎస్. పి. నాయకుడు శ్రీ ఎస్. ఎన్. ద్వివేదీ ఒక ప్రకటనలో పేర్కొన్నారు. అన్ని వర్గాలవారు ఆయనను అభిమానించారనీ, ఆయన ఆలోచనాసరళి, హృదయనైర్మల్యం అన్ని వర్గాలకు ఆయనను ప్రియతముణ్ణి చేశాయని శ్రీ ద్వివేదీ అన్నారు.

## జి. ఎం. సాదిక్

రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆకస్మిక మరణవార్త విన్నవెంటనే కాశ్మీర్ ముఖ్యమంత్రి శ్రీ జి. ఎం. సాదిక్ తీవ్ర సంతాపం ప్రకటిస్తూ సందేశం పంపారు.

''దేశం మరొక మహావ్యక్తిని కోల్పోయింది. డాక్టర్ జాకిర్ హుస్సేన్ సేవలు, ముఖ్యంగా విద్యారంగంలోను, సాహిత్యంలోను ఆయన సేవలు నిరుపమానం. సహాయ నిరాకరణోద్యమ సమయంలో మహాత్మాగాంధీ పిలుపునందుకుని జామియా మిలియాను ప్రారంభించారు. ఆయన స్మారకంగా అది ఎప్పుడూ జీవించి వుంటుంది'' అని శ్రీ సాదిక్ సంతాప సందేశంలో పేర్కొన్నారు.

ఈ విషాద సంఘటనవల్ల జమ్ము, కాశ్మీర్ ప్రభుత్వం, ప్రజలు తీవ్రంగా దుఃఖించారని పేర్కొన్నారు.

# డాక్టర్ జాకిర్ హుస్సేన్ సతీమణి కృతజ్ఞతలు

**స్వర్గీయ జాకిర్ హుస్సేన్ సతీమణి బేగం హుస్సేన్ ఈక్రింది ప్రకటన చేశారు**

**'నా భర్త పరమపదించిన సందర్భంగా, దేశంలో పలుప్రాంతాల నుంచీ, విదేశాలనుంచీ, అనేక సానుభూతి సందేశాలుఅందాయి, ఈదుఃఖ సమయంలో, వారు చూపిన ప్రేమకూ, ఆదరానికీ నా కృతజ్ఞతలు, మాకు సానుభూతి తెలియజేసిన వారందరికీ కృతజ్ఞతలు.**

## అజయ్ ముఖర్జీ

డాక్టర్ జాకిర్ హుస్సేన్ హఠాన్మరణవార్త తమకు తీవ్ర దిగ్భ్రాంతి కలిగించిందని, పశ్చిమబెంగాల్ మంత్రి మండలి తరపున తమ తరపున ఆయన కుటుంబానికి తాము ప్రగాఢ సానుభూతి తెలుపుతున్నామని పేర్కొంటూ పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ అజయ్ ముఖర్జీ నేడు ఉపరాష్ట్రపతి శ్రీ వి. వి. గిరికి తంతి పంపారు. ఈ తంతి ప్రతులు ప్రధానికి, రాష్ట్రపతి కార్యదర్శికికూడా పంపబడ్డాయి.

## ప్రొఫెసర్ కబీర్

డాక్టర్ హుస్సేన్ మేధావి, నిర్మలహృదయుడు కావడంతో పాటు ప్రేమించదగిన వ్యక్తిత్వం కలవారనీ; ఆ వ్యక్తిత్వం ఆయనను అందరికీ ప్రియతములను చేసిందనీ పార్లమెంటు సభ్యుడు ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్ పేర్కొన్నారు.

## డాంగే

డాక్టర్ హుస్సేన్ రాష్ట్రపతిగా ఎన్నిక కావడం దేశంలో మతరహిత భావాలకు విజయమనీ, ఆయన మరణం దేశానికి తీరని లోటనీ శ్రీ ఎస్ ఏ. డాంగే అన్నారు.

## ఎస్. ఎం. జోషి

''మనం ఎంతో క్లిష్టస్థితిలో గమనం సాగిస్తున్నాము. ఇటువంటి సమయంలో డాక్టర్ హుస్సేన్‌వంటి సమగ్రత కల వ్యక్తి ఎంతో సహాయకారిగా వుండి వుండడం జరిగేది'' _అని శ్రీ ఎస్. ఎం. జోషి (ఎస్. ఎస్. పి.) అన్నారు.

## ఎస్. ఎం. బెనర్జీ

జాకిర్ హుస్సేన్ మృతివల్ల దేశానికి ఏర్పడినలోటు తీరడం కష్టమని శ్రీ ఎస్. ఎమ్ బెనర్జీ అన్నారు.

## జ్యోతిబాసు

పశ్చిమ బెంగాల్ మార్క్సిస్టు కమ్యూనిస్టు ఉప ముఖ్య మంత్రి శ్రీ జ్యోతిబాసు "డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆకస్మిక మృతి నిజంగా విభ్రాంతి కలిగిస్తున్నది. ఆయన కుటుంబ సభ్యులకు నా సానుభూతిని తెలుపుతున్నాను." అన్నారు.

పత్రికాప్రతినిధులు ఈ విషాదవార్తను తెలిపినప్పుడు జ్యోతిబాసు కొన్ని క్షణాలపాటు మౌనంగావున్నారు.

## వి. పి. నాయక్

మహారాష్ట్ర ముఖ్యమంత్రి వి. పి. నాయక్ రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆకస్మిక మృతి పట్ల తీవ్ర సంతాపం వ్యక్తంచేస్తూ—డాక్టర్ జాకిర్ హుస్సేన్ గొప్ప పండితుడు, యుగయుగాలుగా దేశం సముపార్జించిన మహత్తర సంస్కృతుల సమ్మేళనానికి ఆయన ఒక ఉజ్వల చిహ్నం" అని అన్నారు.

యువకులకు ఆయన ఆదర్శజీవితం ఆవేశం, ఉత్తేజం కలిగిస్తూ వుంటాయి. ప్రశంసాత్మకమైన ఆయన వ్యక్తిత్వం, సమ్రత, అణకువ ఆయన హోదాకు మరింత వన్నె తీసుకొని రావడమేగాక ఒక విధమైన అపురూప విశిష్టతను, ప్రతిభను కూడ తీసుకొని వచ్చాయి. ఆయన మృతి భారత దేశానికి తీరని నష్టాన్ని కలిగించిందని" ఆయన అన్నారు.

## జై సుఖ్‌లాల్ హాథీ

కేంద్ర కార్మిక మంత్రి శ్రీ జై సుఖ్‌లాల్‌హాథీ రాష్ట్రపతి డా॥ జాకిర్ హుస్సేన్ మరణవార్తపట్ల సంతాపం వెలిబుచ్చుతూ "జాకిర్ హుస్సేన్ మృతివలన దేశానికి తీవ్ర నష్టం ఏర్పడింది. జాతి అంతా ఆయన మృతి చెందారన్న వార్త విని దిగ్భ్రాంతి చెందింది. మనం ఒక అనుపమ దేశభక్తుడిని, ప్రముఖ విద్యావేత్తను, మహా పండితుడిని కోల్పోయాము" అన్నారు.

## కాంగ్రెసు కార్యవర్గం

బహుముఖీనము, సర్వసంపన్నము, సుసంశ్లిష్టమునైన భారతీయ సంస్కృతికి శాశ్వతమైన సజీవ సంకేతంగా నిలబడి, ఆసేతు సీతనగ మధ్యస్థ సకలజన గౌరవాభిమానములను చూరగొన్న పరమోత్తమ వ్యక్తిగా కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం స్వర్గీయ డాక్టర్ జాకిర్ హుస్సేన్‌కు శ్రద్ధాంజలి ఘటించింది.

శ్రీ ఎస్. నిజలింగప్ప అధ్యక్షత క్రింద సమావేశమైన కార్యనిర్వాహకవర్గం ఆమోదించిన సంతాప తీర్మానంలో యింకా యిలా పేర్కొన్నది.

"రాజ్యాంగ చట్టబద్ధములైన పరమాదర్శములకోసం తన జీవిత సర్వస్వాన్ని త్యాగం చేసిన ఆ మహనీయుని ఆకస్మిక మరణం వల్ల దేశానికి సంభవించిన నష్టాన్ని యింతింతని పేర్కొనడం కష్టం.

భారత దేశంలోని అన్ని శాసనసభలకు చెందిన సభ్యులు ఆయనను రాష్ట్రపతి పదవికి ఎన్నుకొనడం వారికి ఆ మహనీయునందు గల అఖండ విశ్వాస గౌరవాదరములకెత్తిన విజయపతాక. రాష్ట్రపతి శ్రీ జాకిర్ హుస్సేన్ తాను అధిష్ఠించిన పీఠాన్ని మరింతగా ప్రకాశింపజేశారు. జాతీయ, అంతర్జాతీయ సమస్యలను క్షుణ్ణంగా అవగాహన చేసుకుని, శాంతియుతంగా వాటిని పరిష్కరించడానికి ఆయన నిర్విరామంగా కృషి చేశారు. శాంతి సౌహార్ద సంస్థాపనకై దీక్షాబద్ధుడుగా ఆయన యావత్ప్రపంచ విశ్వాసాన్ని చూరగొన్నారు. ఆయన హఠాన్మరణం వల్ల యావద్భారతమూ పొందిన నష్టాన్ని అశేష భారత ప్రజానీకంతోపాటు యీ కార్యనిర్వాహక వర్గం కూడా పంచుకుంటున్నది. ఆయన సతీమణి బేగం షాజహాన్‌కు, తదితర కుటుంబ సభ్యులకు యీ కమిటీవారు యీ కష్టకాలంలో తమ సానుభూతిని అందజేయుచున్నారు."

అఖిల భారత కాంగ్రెసు కమిటీ సిబ్బంది కార్యవర్గ సభ్యులు కూడా స్వర్గీయ రాష్ట్రపతికి నేడు శ్రద్ధాంజలి ఘటించారు.

## ముస్లింలీగు పార్లమెంటరీ పార్టీ

ముస్లింలీగు పార్లమెంటరీ పార్టీ ఒక సంతాప తీర్మానం గావిస్తూ స్వర్గీయ హుస్సేన్ గుణగణాలను శ్లాఘించింది.

## ఢిల్లీ హైకోర్టు

ఢిల్లీ హైకోర్టు సభ్యులు స్వర్గీయ రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్‌గౌరవార్థం నేడు రెండు నిమిషాలు మౌనం పాటించారు. తర్వాత జరిగిన బెంచి, బార్ సభ్యుల సంయుక్త సమావేశంలో డాక్టర్‌హుస్సేన్ ఆకస్మిక నిర్యాణంపట్ల సంతాపం ప్రకటించి బేగం హుస్సేన్‌కు, కుటుంబ సభ్యులకు సానుభూతి తెలిపారు.

హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఐ. డి. దువా, డాక్టర్ హుస్సేన్ గొప్ప విద్యావేత్తయనీ, మత ప్రసక్తిలేని రాజ్యాంగ వ్యవస్థకు ప్రతీకయనీ నివాళులర్పించారు.

## కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ

కాంగ్రెస్‌పార్లమెంటరీపార్టీ మే 4వ తేదీన ఒకతీర్మానంచేస్తూ ఏ ఆదర్శాలపట్ల స్వర్గీయ రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్‌కు అచంచల విశ్వాసంకలదో, వాటిని దృఢతర సంకల్పంతో అనుష్ఠించడమే ఆయనకు సముచితమైన, సార్థకమైన శ్రద్ధాంజలి కాగలదని పేర్కొన్నది.

పార్లమెంటు రెండు సభలు స్వర్గీయ డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతిపట్ల సంతాపాన్ని వెలిబుచ్చిన వెన్వెంటనే పార్లమెంటరీ పార్టీ సమావేశమై డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆకస్మిక మృతి మూలంగా తమకు కలిగిన ప్రగాఢ విచారాన్ని వెలిబుచ్చింది.

'దేశం ఒక గొప్ప దేశభక్తుని, విద్యావేత్తను, మహాపండితుని, రాజనీతిజ్ఞుని, మానవతావాదిని భారతీయ మతసంస్కృతులు మూర్తీభవించిన మహావ్యక్తిని కోల్పోయింది. ఆయనలో మాధు

ర్యం, సౌహార్దం, గాంభీర్యం తొణికిసలాడుతూ తమ ప్రభావాన్ని ఇతరులపై ప్రసరించేవి. జాతి సమైక్యతను కాపాడడానికి ఎట్టి త్యాగమైనా చెయ్యడానికి వెనుదీయని వ్యక్తి. ఆయన గాంధీజీ అనుచరుడు. భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న మహా యోధుడు. దేశం ఆశయాలకు ఆశాజ్యోతిగా వెలుగొందిన ఒక మహానాయకుని దేశం యీ సమయంలో కోల్పోవడం విషాదకరం. కాంగ్రెస్‌పార్టీ బేగం హుస్సేన్‌కు కుటుంబంలోని ఇతర సభ్యులకు హృదయపూర్వకమైన శ్రద్ధాంజలి సమర్పిస్తున్నది" అని కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ తన తీర్మానంలో పేర్కొన్నది.

## ఎస్. ఎస్. పి. వర్గం

పార్లమెంటులోని సంయుక్త సోషలిస్టుపార్టీ వర్గం ఒక అసాధారణ సమావేశం జరిపి డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆకస్మిక, అకాలమరణానికి హృదయపూర్వకమైన సానుభూతి తెలుపుతూ ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

"ఆయన మరణంవల్ల సంభవించిన లోటును తీర్చడం అసంభవం కాకపోయినప్పటికీ మిక్కిలి కష్టసాధ్యమనక తప్పదు. నిజానికి జాతీయ దృక్పథంకల ముస్లిం నాయకుడైనప్పటికి ఇతర మతాలపట్ల ఆయనకు గల గౌరవాభిమానాలు అపారం" అని ఈ తీర్మానం అన్నది.

## కమ్యూనిస్టువర్గం

పార్లమెంటులోని భారత కమ్యూనిస్టుపార్టీ వర్గం కొత్త ఢిల్లీలో సమావేశమై డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి సంతాపం వెలిబుచ్చుతూ ఈ విధంగా తీర్మానించింది.

"మతాతీత లౌకిక రాజ్యాంగ వ్యవస్థకు, జాతీయసమైక్యతకు ప్రతీకగా వెలసిన భారత రిపబ్లిక్ అధ్యక్షుడు డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి భారత కమ్యూనిస్టుపార్టీకి చెందిన పార్లమెంటు సభ్యులు గాఢమైన విచారం వెలిబుచ్చుతున్నారు.

"తన పదవిని ఎంతో హుందాతనంతోను, మానవతతోను నిర్వహించిన ప్రజ్ఞాశాలి ఆయన. ఆయన కుటుంబానికి ఈ సమావేశం తన గాఢమైన సానుభూతి సంతాపాలను తెలుపుతున్నది.

## జనసంఘం

జనసంఘం పార్లమెంటరీ పార్టీ కొత్త ఢిల్లీలో అత్యవసర సమావేశం జరిపి డాక్టర్ హుస్సేన్ మృతికి సంతాపం తెలుపుతూ ఒక తీర్మానం ఆమోదించింది.

డాక్టర్ హుస్సేన్ పాండిత్యమూ, బహుముఖమైన ప్రజ్ఞ, కళాతృష్ణ కల వ్యక్తి అని ఆ తీర్మానం పేర్కొన్నది. ముఖ్యంగా విద్యారంగంలో ఆయనచేసిన కృషి గణనీయమైనదని, ఆయన సేవలను జాతి ఎన్నటికీ మరిచిపోదని జనసంఘం తన తీర్మానంలో తెలియజేసింది.

## డి. ఎం. కె. పార్టీ

డి.ఎం.కె. పార్లమెంటరీ పార్టీ ప్రొఫెసర్ అంబజగన్ అధ్యక్షతన సమావేశమై రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ మృతికి ప్రగాఢసంతాపం తెలుపుతూ తీర్మానంచేసింది.

దేశం ఒక గొప్ప విద్యావేత్త, పండితుడు. అకలంక దేశభక్తుడు, రాజనీతిజ్ఞుని కోల్పోయిందని తీర్మానం పేర్కొన్నది.

## స్వతంత్రపార్టీ

పార్లమెంటులోని స్వతంత్రపార్టీ సభ్యులు అత్యవసర సమావేశం జరిపి రాష్ట్రపతి ఆకస్మికమృతిపట్ల సంతాపాన్ని వ్యక్తం చేశారు.

"డాక్టర్ హుస్సేన్ గొప్ప దేశభక్తుడు, రాజనీతిజ్ఞుడు, విద్యావేత్త" అని ఒక ప్రకటనలో పేర్కొన్నారు.

## భారతీయ క్రాంతిదళ్

డాక్టర్ జాకిర్ హుస్సేన్ మరణంతో దేశం రాష్ట్రపతినే కాక, అన్ని వర్గాల ప్రజల విశ్వాసం పొందిన ఒక రాజనీతిజ్ఞుని కోల్పోయిందని లక్నో భారతీయ క్రాంతిదళ్ ఛైర్‌మన్ శ్రీ చరణ్‌సింగ్ అన్నారు.

మత ప్రమేయంలేని తత్వాన్నీ పెద్ద మనిషి లక్షణాలను అనితరంగా పుణికిపుచ్చుకున్నారని ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సాధారణ కార్యదర్శి శ్రీ హెచ్. ఎన్. బహుగుణ అన్నారు.

## ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్

మత ప్రమేయంలేని తత్వానికీ, ప్రజల సమైక్యతకూ అంకితమైపోయిన వ్యక్తిగా డాక్టర్ హుస్సేన్ ఎల్లప్పటికీ గుర్తుగా ఉండిపోతారనీ అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఒక సంతాప సందేశంలో పేర్కొన్నది.

# ఆంధ్రప్రదేశ్ లో . .

## రాష్ట్ర గవర్నర్

ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ ఖండూబాయ్ దేశాయ్, రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ మరణానికి తమ గాఢ సంతాపాన్ని ప్రకటిస్తూ ఇలా అన్నారు.

రాష్ట్రపతి డాక్టర్ జాకిర్‌హుస్సేన్ ఆకస్మిక విషాద మరణం నాకు అమితమైన దిగ్భ్రాంతి కలిగించింది. వివిధ రంగాలలో ఆయన దేశానికి అనేక సంవత్సరాలుగా చేసిన నిస్వార్థ సేవ గణనీయమైనది. ఆ సేవ భావి తరాలవారికి మహోజ్వలమైన తార్కాణంగా విలసిల్లగలదు. ఆయన విద్యాధికుడు. బహుముఖ ప్రజ్ఞాశాలి. గాంధీజీ అనుచరుడు. రాష్ట్రపతి పదవిని ఎంతో సమర్థతతో నిర్వహించిన నాయకుడు. ఆయన మృతివల్ల దేశం ఒక గొప్పనాయకుని కోల్పోయింది.

## బ్రహ్మానందరెడ్డి

ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి, రాష్ట్రపతి గుండె జబ్బు మూలంగా కన్నుమూసినట్లు తెలియగానే ఈవిధంగా ప్రకటించారు.

"డాక్టర్ జాకిర్‌హుస్సేన్ ఆకస్మిక మరణవార్త నాకు విభ్రాంతి కలిగించింది. ఆయన గొప్ప రాజనీతిజ్ఞుడు. విద్యావేత్త. సమాజంలోను, దేశంలోను, విదేశాలలోను, అన్ని వర్గాల ప్రజల మన్ననలను అందుకొన్న మహామనిషి.

"ఆయన అజాతశత్రువు. ఇది నిజంగా తీరని నష్టం."

## తిమ్మారెడ్డి

రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ మరణానికి తన ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తంచేస్తూ రాష్ట్ర వ్యవసాయమంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి, రాష్ట్రపతి కుటుంబానికి ఒక సందేశం పంపారు.

డాక్టర్‌హుస్సేన్ బాపూజీకి విశ్వాసపాత్రుడైన సహచరుడని, హిందూ ముస్లిం సమైక్యతకు రాష్ట్రపతి ఒక చిహ్నంగా ఉన్నారని శ్రీ తిమ్మారెడ్డి అన్నారు. దేశం ఆకాలంలో ఒక గొప్ప నాయకుని కోల్పోయిందనీ, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ ప్రజలకు డాక్టర్ హుస్సేన్‌పట్ల విశేష గౌరవాభిమానాలు కలవని ఆయన పేర్కొన్నారు.

## వి. సత్యనారాయణ

మహాత్మా గాంధీని అనుసరించి, ఆయన ఆశయాలసాఫల్యానికి కృషిచేసిన జాకిర్ హుస్సేన్ నిర్యాణం దేశానికి తీరనిలోటు తెచ్చిపెట్టినదని ఎక్సయిజ్ మంత్రి శ్రీ వి. సత్యనారాయణ పేర్కొన్నారు.

## బి. వి. గురుమూర్తి

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ గొప్ప జాతీయ ముస్లిం అనీ, ఆయన దేశానికి ఉత్తమమైన సేవ చేశారనీ, ఆయన లోటును భర్తీ చేయడం కష్టమనీ రాష్ట్ర పారిశ్రామికశాఖ మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి చెప్పారు.

## పి. రంగారెడ్డి

ఆంధ్రప్రదేశ్ శాసనమండలి అధ్యక్షుడు శ్రీ పి. రంగారెడ్డి తన సంతాప సందేశంలో, దేశం ఒక ప్రముఖ విద్యావేత్తను, గొప్ప దేశ భక్తుని కోల్పోయిందని అన్నారు. ఈ మహా వ్యక్తి మృతివలన జాతికి తీరని నష్టం వాటిల్లినదని అన్నారు.

## కాకాని

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ కాకాని వెంకటరత్నం రాష్ట్రపతి మృతికి సంతాపం తెలియజేస్తూ రాష్ట్రపతి కుటుంబానికి సంతాప సందేశం పంపారు.

శ్రీ జాకిర్‌హుస్సేన్ గొప్ప విద్యావేత్త, దేశ నాయకులేగాక హిందూముస్లింల సమైక్యతకు చిహ్నమని, ఆయన లేని లోటు తీర్చలేనిదని తమ సంతాప సందేశంలో అన్నారు.

## జి. లచ్చన్న

రాష్ట్ర స్వతంత్రపార్టీ అధ్యక్షుడు శ్రీ గౌతు లచ్చన్న ఈ దిగువ సంతాప సందేశం పంపారు.

"రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆకస్మిక నిర్యాణానికి సంబంధించిన విషాద వార్త విని దిగ్భ్రాంతి చెందాను. డాక్టర్ హుస్సేన్ వంటి రాజ్యాంగవేత్తను కోల్పోయినందుకు భారతదేశ ప్రజలు మాత్రమేకాకుండా ప్రజాస్వామ్య దేశాల ప్రజలందరూ దురదృష్టవంతులయారు. జాతి, కుల, మతాలతో సంబంధంలేకుండా సామాన్యమానవుని స్థితి గతులు మెరుగుపరచడానికి ఆయన తమ జీవితం అంకితం చేశారు. కేంద్ర ప్రభుత్వం యింటా, బయటా అనేక సమస్యలను ఎదుర్కొంటున్న సమయంలో ఆయన ప్రజాస్వామ్య పరిరక్షణకు పాటుపడ్డారు. విద్యారంగంలో ఆయన ఒనరించిన సేవలు ప్రత్యేకించి పేర్కొనదగినవి."





డా. జాకిర్ హుస్సేన్ గతఏడాది అక్టోబరు నెలలో విజయవాడలో గాంధీకొండపై స్థూపానికి ప్రారంభోత్సవం చేసినప్పటి చిత్రాలు

# డా. జాకిర్ హుస్సేన్ రచనలనుండి....

## పాకిస్థాన్ దురాక్రమణ

ఒక మహదాశయ సాధనకు సర్వశక్తి సంపత్తులనూ సమీకరిస్తూ ఆ మహదాశయంలో విశ్వాసాన్ని ఆత్మస్ఫూర్తితో పునరుద్ఘాటించ వలసిన సమయాలు ప్రతిజాతి జీవితంలోనూ వస్తూ వుంటాయి. రణరంగంలో మన సైన్యాలు కదను త్రొక్కుతున్నాయి. తమ ప్రాణాలనుకూడా త్యాగంచేయడానికి సిద్ధపడుతూ వీరోచిత పాత్రను ఘనంగా నిర్వహిస్తున్న సిబ్బంది మనకున్నారు. వారి కర్తవ్య నిష్ఠ స్వార్థరహితమైనది. బేషరతుగా, మారుమాట్లాడకుండా వారు తమ విధులను నిర్వహిస్తున్నారు. వారికి మన అండదండలు సంపూర్ణంగా వున్నాయని ఆచరణ రీత్యా ప్రకటించడం మన విధి. మనం ఎలా అయితే వారిత్యాగాలను హర్షిస్తూ గర్వపడతామో అలాగే, మన ఆలోచనా సరళికీ, క్రియలకూ వ్యాఖ్యానం చెప్పే తరుణంలో వారి వీర గాథలను స్మరిస్తూ భావితరాలవారు గర్వపడేటట్లు చూడవలసిన బాధ్యత మనది. ఈనాడు మనంచేయవలసివస్తున్న యుద్ధం మనం కోరి తెచ్చుకున్నది కాదు.

బలవంతంగా ఇది మనపై రుద్దబడింది. మనజాతీయాశయమైన శాంతిరక్షణకు కృషిచేయడంలో మనం ఏదేశ ప్రజలకూ తీసిపోము. హృదయ పూర్వకంగా మనం శాంతిని కోరాము. మన శక్తులన్నీ కేంద్రీకరించి అందుకోసం కృషిచేశాము. ఎవరూ చెడిపోవాలని మనం కోరలేదు. ఇతరుల భూభాగం ఆవంతైనా మన కక్కరలేదు. అయితే మనదేశానికీ, మన సమస్తజీవన భావానికీ ప్రాతిపదికగా నిలుస్తున్న సూత్రాలకు తిలోదకాలు యివ్వలేము. వాటి పరిరక్షణే మనకర్తవ్యం. కాశ్మీరు భారతదేశంలో అంతర్భాగం; సుందరనందనోద్యానం లాంటిది. కాశ్మీరు భారతదేశంలో అంతర్భాగంగా ఉండడం మన సాంస్కృతిక ఔన్నత్యానికి, మానవజాతి సాంస్కృతిక విశిష్టతకూ ఉత్తమ చిహ్నం.

మన స్వాతంత్ర్య సిద్ధికి షరతుగా దేశాన్ని విభజించాలన ఒత్తిడి రావడం దురదృష్టం. దేశ విభజనను కోరినవారు దానివల్ల కలిగే దుష్ఫలితాలను గుర్తించలేదు. తాము ముస్లింలు కావడంచేత తాము భారతదేశంలో ఉండలేమన్న తప్పుడు నినాదానికి మద్దతు ఇవ్వవలసిందని భారత ముస్లింలను కోరడం జరిగింది. తమ తండ్రులూ, తాతలూ పుట్టి పెరిగిన భారతీయ ఉమ్మడి సంస్కృతికి అనేక శతాబ్దాలుగా ఎంతో దోహదం చేసిన భారతదేశాన్ని వదలి రావలసిందని కోరడం జరిగింది. ఇళ్లూ, వాకిళ్ళనూ, మిత్రులనూ, పొరుగువారినీ, సౌహార్దాన్నీ, సంస్కృతినీ అన్నింటినీ వదులుకోవాలని ముస్లింలను కోరారు. ఇప్పుడు భారతీయులకు అంటే హిందువులకూ,ముస్లిములకూ, సిక్కులకూ, క్రైస్తవులకూ, పార్శీలకూ ఇప్పుడూ ఎప్పుడూ మాతృదేశంగా వున్న భారత దేశాన్ని తుపాకి కాల్పులతో బెదరిస్తూ కాశ్మీరులో అధికసంఖ్యాకులు ముస్లింలు కాబట్టి కాశ్మీరు భారతదేశానికి చెందడం అన్యాయమనీ,దానిని పాకిస్తాన్‌కు దత్తం చేయాలనీ కోరడం జరుగుతోంది.

ఈసమయంలో మనం స్వశక్తితోనూ, స్వీయ ఆదర్శాలతోనూ మన విశ్వాసాన్ని పటిష్ఠం చేసుకోవడం అవసరం. మనమంతా ఒకే జాతి అని సమాన ఆదర్శాలూ, ప్రయోజనాలూగల ఏక కుటుంబమని మన సమైక్యత ఏ సందర్భంలోనూ చెక్కుచెదరదని నిరూపించేందుకు ఈ మన వీరులు హిందువులూ, ముస్లిములు, సిక్కులూ, క్రైస్తవులూ, పార్శీలూ తమ ప్రాణాలను ఒడ్డుతున్నారన్న విషయాన్ని మనం గుర్తించాలి. మనలోని ముస్లిములు దైవేచ్ఛద్వారానే ఇక్కడ ఉన్నామని భారత పౌరసత్వం నైసర్గి

కంగానూ, ఆధ్యాత్మికంగానూ ఎంతో పవిత్రమైనదనీ గుర్తించాలి. నిజమైన ఇస్లాము మతానువర్తిగా వ్యవహరించాలి. స్వార్థానికీ, ద్వేషానికీ, రాజకీయ సాంఘిక భేదదలకూ మూలకందమైనభయాన్ని విడనాడాలి. సౌహార్దాన్నీ విశ్వాసాన్నీ, పెంపొందించుకోవాలి. నిస్వార్థ సేవ చెయ్యాలి. పరమార్థ దృక్పథం అలవరచుకోవాలి. ఈ బాధ్యతను తోటి ముస్లిం పౌరులు సదా గుర్తిస్తూవుండాలి. ఎట్టి అనుమానాలకూ తావు ఇవ్వరాదు. అధిక సంఖ్యాకుల నమ్మకాలను విశ్వాసాలను గౌరవిస్తూ ఉమ్మడిప్రయోజన సాధనకు కృషిచేయాలి.

ప్రకటితాదర్శాల సామ్యంపైనే కాక సర్వ ప్రజల భావ సమైక్యతపై కూడ జాతి శక్తి సంపత్తులు ఆధారపడి ఉంటాయి. మనం ఎక్కడా తప్పటడుగువెయ్యకుండా మన విధులను మనం నిర్వహించడం అలవాటు చేసుకోవాలి. మన నాయకుల పట్ల పూర్తి భక్తివిశ్వాసాలు ప్రకటించి వారిని అనుసరించ వలసిన సమయం ఇది. ఈ సమయంలో మన నాయకులు తమ విద్యుక్త ధర్మాలను స్వేచ్ఛగా, శీఘ్రంగా నిర్వహించడానికి మనం అవ



కాశం కల్పించాలి. లక్ష్య సాధనకై సర్వప్రజలు జీవితాలనే అంకితం చేసుకోవలసిన తరుణం ఇది. మన జాతీయ తాలూకు ప్రాతిపదిక విలువలకూ, సిద్ధాంతాలకూ భంగం కలిగే ప్రమాదం ఏర్పడింది. ఈ ప్రమాదాన్ని మనం ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడి ఎదుర్కో వలసి ఉన్నది. దేశంలో సర్వ ప్రజలు పరస్పర సానుభూతి, సహకారం, సామరస్యం ప్రకటించి దేశానికి అత్యుత్తమంగా సేవ చేయడానికి ప్రోత్సాహం కల్పించాలి. మన సిద్ధాంతాలనూ, మాతృదేశ స్వాతంత్ర్యాన్నీ సంరక్షించుకొనేందుకు మనం అంతా దృఢసంకల్పంతో కృషిచేయడానికి సన్నద్ధంకావాలి.

## నైతిక చైతన్యం

క్షుద్బాధను తీర్చుకోవడం మంచిదేకాని కడుపుబ్బ తినడం మాత్రం మంచిపనికాదు. ఎన్నో త్యాగాల్ని చేసి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నాం మనం. అయితే స్వాతంత్ర్యం గురించి పోరాడి, దానిని సాధించిన మనలోనే ఏదోలోపం వున్నట్టుంది. మనలో చాల మంది స్వార్థపరులూ, దురాశాపరులూ అయిపోయారు. వారేగాని నిష్కల్మషమైన జీవితాన్ని గడిపివుండి వుంటే అప్పుడు వారు యితరులను పరిశుద్ధమైన, తప్పుపట్టడానికి వీలు లేని స్వచ్ఛమైన జీవితాన్నిగడపమని అడగడంలో అర్థంవుంది. అలా కానప్పుడు కేవలం మాటలు మాత్రమే చెప్పడం, క్రియా శూన్యత్వం అనిపించుకుంటుంది. నిజానికి కేవలం మాటలతో మూటలు కట్టలేం. వట్టి పలుకులతో పనిజరగడం కల్ల. నెల్లాళ్ళు పనిచేసి ఓగంట ప్రసంగించు అన్నది సరైన పద్ధతి. బళ్ళకొద్దీ, టన్నులకొద్దీ మాటల్ని పోగులు పెట్టడంకన్న కొన్సంత పనిచేసి చూపడం మంచిది. మన నోటినుంచి వచ్చే ప్రతి మాటా మన భుజాలమీద బరువుగా తయారవుతుంది. ఆ బరువును మనంమోయ డానికి సిద్ధంగా వుండాలి. దానిని సాధించి మరీ చూపించాలి. లేకపోతే ఆ బరువే తలకుమోపిడై మనల్ని అణగదొక్కేస్తుంది. ఈ మాటలన్నీ నేను ఎందుకు చెప్తున్నానంటే నేను ఎన్నో సమా



డా. జాకిర్ హుస్సేన్ 1965లో కావలి కళాశాలను జవహర్ భారతిగా స్వర్గీయ జవహరాల్ నెహ్రూ స్మృతికి అంకితం చేస్తున్నప్పటి చిత్రాలు

వేశాలకు హాజరయ్యాను. అక్కడ వేదికమీద బల్లగుద్ది చెప్పిన మాటలన్నీ నీటిలో మూటలు అయిపోతూ వచ్చాయి. పెద్ద పెద్ద మాటలతో ప్రకటనలుచేసి, తీర్మానాలుచేసి, తీరా ఆచరణలోకి వచ్చేసరికి వాటిని చిత్తశుద్ధితో సాధించే ఓపికలేక ప్రసంగాలు ప్రసంగాలుగానే మిగిలి పోతున్నాయి. అందువల్ల యితరులను స్వచ్ఛమైన, నిజాయితీతో కూడిన జీవితాన్ని గడపమని, ఉన్నత నైతిక ప్రమాణాలను పోషించమని అడిగేవారు ముందుగా ఆత్మావలోకనం చేసుకొని తమలోని లోపాలను సరిదిద్దుకోవడం అవసరం.

## ఒక క్రొత్త సాంఘిక దృక్పథం

ప్రతిమనిషి పరిశుద్ధమైన జీవితాన్ని గడపాలనే కోరుకుంటాడు. అది మానవ ప్రవృత్తి. అయితే ప్రజలు చూసి, అనుసరించడానికి ఎట్టఎదుట కళ్ళకు కనబడుతూ ఉదాహరణ అంటూ

ఒకటి ఉన్నప్పుడే ఆ ప్రవృత్తి కార్యరూపం ధరిస్తుంది. అందుకే మాటల్ని వల్లించటంకన్న కార్యరూపంలో కళ్ళకు కనిపింపజేసే ఉదాహరణలు వుండాలి. లేకపోతే నీతులు ఎన్ని వల్లించినా వాటి వల్ల ఎక్కువ ప్రయోజనం సిద్ధించదు. తప్పుడు పనుల్ని ప్రజలు సహించలేని ఒక క్రొత్త వాతావరణాన్ని సృష్టించడానికి మనం ప్రయత్నించాలి. అవినీతిపరులు—వారు తమ జీవితంలో ఎంతటి విజయాన్ని సాధించినప్పటికీ—సమాజంలో ఏ విధమైన గౌరవాన్నీ పొందలేని విధంగా ఒకక్రొత్త సాంఘిక దృక్పథాన్ని మనం అలవరచుకోవాలి. ఈ మార్గంలో మనం విజయాన్ని సాధించాలంటే అందుకు ఎన్నో సంవత్సరాలపాటు ఎంతోకృషి కొనసాగించవలసిన అవసరంవుంది.

భారత దేశాన్ని సత్యవంతమైన దేశంగా, భారత ప్రజలను సత్యసంధులుగా కీర్తి ప్రతిష్ఠలకు ఆలవాలం చేయాలంటే మనలో చిత్తశుద్ధీ, నిజాయితీ, ఉత్సాహమూ, పరస్పర సహ-



కావలి కళాశాల జవహర్ భారతిలో డా. జాకిర్‌హుస్సేన్

కారము వుండాలి. ఒకక్రొత్త శక్తిని, ఒక విధమైన త్యాగశీలతను, నిస్వార్థతను మనలో ప్రతిష్ఠించుకోవాలి, ఆనాడే మనం పరిస్థితులకు ఎదురొడ్డి ధీటుగా నిలబడగలం.

మానవాళిలో నైతిక చైతన్యం దృఢతరమయ్యే కొద్దీ, సత్యం, న్యాయం, లోకంలో పటిష్ఠమైన పునాదులు వేసుకుంటాయి. అధికారం చలాయించి ప్రజలలో నైతిక చైతన్యం వర్ధిల్లేటట్లు చేయలేం. నైతిక చట్టానికి బద్ధులుగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వ్యవహరించేటట్లు మనం ప్రజలలో ఆసక్తిని కలిగించాలి. యిది చూచేందుకు అతి సర్వసాధారణమైన విషయంగా కనిపిస్తుంది. ఆచరణకు ప్రారంభించినపుడు అది ఎంత కష్టతరమైన విషయమనేది మనకు బోధపడుతుంది. ఇతరులలో నైతికచట్టం పట్ల విశ్వాసాన్ని పెంపొందింప దలచిన వ్యక్తి తన లక్ష్య సాధనకు అధికారం ఉపయోగించే విధానానికి ముందుగా తాను స్వస్తి చెప్పాలి. కష్టపడి, ఇతరుల పట్ల సహనభావం వహించే పద్ధతిని తరచూ అవలంబించి ఆచరించాలి. దీనికెంతో ఓర్పు, దీర్ఘ పరిశీలనాశక్తి, పరిశ్రమ అవసరం. సత్య మార్గంలో ప్రజలకు నాయకత్వంవహించ దలచిన ప్రతి వ్యక్తి కీర్తిభావాన్ని వెనక్కు నెట్టాలి. నిరంతరం ఆత్మపరీక్ష చేసుకుంటూ నాయకుడు అనుచరుల అందరిమేలు కాంక్షించినపిమ్మట తనమేలు చూసుకోవాలి. సిద్ధాంతాల కనుగుణమైన ఆచరణ అవసరమని మనమంతా అంగీకరిస్తాం. ఈ రెండింటి మధ్య స్వచ్ఛమైన సమన్వయాన్ని ఆదర్శప్రాయంగా సాధించగలిగేందుకు ఎంతమందిలో అందులకు అవసరమైన నిజాయతీభావం మనకు గోచరిస్తుంది ? ఈ సమన్వయాన్ని సంపూర్ణంగా సాధించేందుకు గాంధీగారు కృషిచేశారు. ఆయన దైనందిన జీవిత విధానాన్ని, వేషభాషలను, ఆహారపానీయాల నియమాలను అన్నిటికంటే ముఖ్యమైన, తోటి కార్యకర్తలపట్ల ఆయన అనుసరించే విధానం గురించి మనం తెలుసుకోవాలి. ఈ విషయాలనే మనం సాధారణంగా విస్మరిస్తుంటాము. మన చేతులు కట్టివేసే ఈ విధానలను మనం అనుసరించదలచుకోము. అదే బలహీనత. నిజాయతీ వ్యక్తులు మాటలతో సంతృప్తి చెందరు

## నిర్మాణాత్మక కార్యక్రమం

గాంధీజీ తాను సూచించిన నిర్మాణ కార్య క్రమంలో నిమగ్నులై పోయేందుకు సర్వదా కృషి చేస్తారు. నిర్మాణ కార్యక్రమంలో ముఖ్యమైన రెండు అంశాలు ఒకటి—ఎన్నుకొనే పని, రెండవది. దానిని నిర్వహించేందుకు సామర్థ్యంకల కార్యకర్త. తను విశ్వసించిన దాన్ని ఆచరించేందుకు గాంధీజీ తన పయోజన జీవితంలో గడిపిన ప్రతి నిముషమూ, అనుసరించిన ప్రతి మార్గమూ ఆదర్శప్రాయంగా నిలిచిపోయాయి. తానునిజాయతీగావుంటే ఇతరులలో ఆ గుణాన్ని ప్రోత్సహించేందుకు వీలుంటుందని ఆయన భావన. నా కార్యనిర్వహణ విషయంలో నేను చూపే భక్తి శ్రద్ధలలోగాంధీ తత్వం ప్రతిఫలిస్తుంది. ఆ తత్వం నా మాదిరే అనేక మందిని ప్రభావితంచేసి వుండవచ్చు. గాంధీజీ నిర్మాణాత్మక కార్యక్రమం చరిత్రాత్మకమైనది. ఆయన సమాజ నిర్మాణ విధానం అన్ని కాలాల్లోనూ ప్రాధాన్యతను కలిగివుంటుంది.

ఈ నాడు ఈ విషయాలే మనం గుర్తించుకోవాలి. స్వేచ్ఛాయుత ప్రజానీకంగా ప్రభుత్వాన్ని నడిపే అధికారం కలిగిన మనలో, నాయకత్వం అనేది అధికారం మీద ఆధారపడకుండా, నిజాయతీ గుణాన్ని మూలాధారం చేసుకొని, నిర్మాణ కార్యక్రమం సాగిస్తూ తరతరాలు ఈ సదాశయ జ్యోతి ని మోసికొనిపోగల ఉత్తమ సమాజాన్ని సృష్టించ కలిగేదిగా వుండాలి, అదే నిజమైన నాయకత్వం. సర్వదా వాంఛనీయమైన నాయకత్వం.







డా. జాకిర్ హుస్సేన్ గత ఏడాది జూలై నెలలో హైదరాబాదులోని సాలార్‌జంగ్ మ్యూజియం నూతన భవనాలకు ప్రారంభోత్సవం చేసినప్పటి చిత్రాలు

# డా. జాకిర్ హుస్సేన్ జీవితంలో మలుపు

విద్యా బోధనే డా॥ జాకిర్ హుస్సేన్‌కు హృదయాహ్లాదకరమైన వృత్తి. రాజకీయాలలో ఉజ్వలమైన తారలాగ భాసించడం చేతగాకకాదు. విద్య అనేది జాతీయ జీవితంలో అత్యంత ప్రాముఖ్యం గల ప్రాథమిక అంశంగా ఆయన భావించడంచేతనే అది ఆయనకు అత్యంత హృదయగతమైంది. ఒక దేశంలోని విద్యా ప్రమాణాన్ని బట్టే అక్కడి ప్రజలస్థాయి ఆధారపడి వుంటుంది. ఈ రెండూ విడదీయరాని విషయాలు అని డా॥ జాకిర్ హుస్సేన్ అంటారు.

ఈ దేశంలో విద్య పూర్తిగా ప్రభుత్వంమీదనే ఆధారపడి వుండడం దురదృష్టకరం. ఇక్కడ విద్య రాజకీయాల ప్రభావంలో పడి తలమునకలు వేస్తున్నదే తప్ప జాతీయ ప్రయోజనాన్ని కాంక్షించడంలేదు.

స్వాతంత్ర్యోద్యమకాలంలో పరిస్థితి యిలాలేదు. ఆనాడు ప్రజలుచూపిన నిస్వార్థ సేవ, సమిష్టికృషి, కష్టపడి పనిచేయడంవంటి గుణాలను స్వేచ్ఛాభారతావనిని తీర్చిదిద్దడంలో చూపించలేక పోతున్నారు. ఆరోజుల్లో జరిగిన కృషికి నాటి 'జాతీయ విద్యావిధానమే' ఒక తార్కాణం. జమియామిలియ సంస్థే యీవిషయంలో ఒక ప్రత్యక్ష నిదర్శనం. "నూరానీ" చెప్పినట్టు జామియా మిలియా చరిత్రే డా॥ జాకిర్ హుస్సేన్ చరిత్ర.

అతిఅణకువగా ఒదిగిఒదిగివున్న చిన్నగుబురులోంచే అత్యంత సమున్నతమైన మహా సింధూరవృక్షం ఎదుగుతుంది. మానవ జీవితంలోనూయింతే. మనిషి అంతరాంతరాలలో మెరిసిన ఒక చిన్న మెరుపు ఒక్కొక్కప్పుడు అతనిచేత గొప్పగొప్ప కార్యాలను చేయిస్తుంది. ఆమెరుపు మెరిసే వరకు ఆ వ్యక్తి అనామకంగా, అప్రయోజకుడిగానే వుండిపోతాడు. డా. జాకిర్ హుస్సేన్ జీవితంలోనూ యిదే జరిగింది.

"నా జీవితంలో నాకు తెలిసి చేసిన తొలినిర్ణయం అ బహుశా అదే నేను తీసుకున్న ఏకైక నిర్ణయం కావచ్చు. మిగి నా జీవితమంతా దానిలోనే కొట్టుకుపోయింది." అన్నారు జా హుస్సేన్ తన నిర్ణయాన్ని గురించి ఒకసారి ప్రస్తావిస్తూ. ఆ యం తీసుకునే నాటికి ఆయన అలీఘడ్‌లో అప్పుడప్పుడే వస్తోన్న యువ విద్యార్థి అధ్యాపకుడు. ఆ నిర్ణయంతో ఆ అన్నిటినీ ప్రక్కకు నెట్టి, 1920లో మహాత్మా గాంధీజీ ప్రా భించిన సహకారనిరాకరణోద్యమంలోకి దూకారు. జాతీయస్థాయి తొలి ప్రజాందోళనకూ, పోరాటానికీ దర్పణం ఆ ఉద్యమమే

ఆ అలీఘడ్ నిర్ణయమే భారతదేశ మూడవ రాష్ట్రప రూపొందించింది. ఆ తొలినిర్ణయమే, ఆ తొలిమెరుపే గనుక పోతే జాకిర్ హుస్సేన్‌కూడ ఆనాటి చాలామంది విద్యావేత్తలవ జీవనభృతికి వీలయిన ప్రభుత్వోద్యోగంతోనో, మరోవృత్తితో సంతృప్తిపడి వుండేవారే. ఆనిర్ణయంవల్లే యువజాకిర్ జాతీ స్వేచ్ఛకూ, జాతీయ విద్యావిధానానికీ అంకితమైన ప్రయోజనాత్మ త్యాగమయ, ఆరాధనాపూర్వకజీవితాన్ని చేపట్టే అవకాశంవచ్చిం

ఆయన గుణగణాలకు సంబంధించిన ఎన్నో ఉదాహరణ నూరానీ పేర్కొన్నారు. కాంగ్రెసు,ముస్లింలీగ్‌ల మధ్యగొడవల కొందరు జమియమిలియాను లాగడానికి చేసిన తీవ్ర ప్రయత్నా విజయవంతంగా అడ్డుకోవడం, ముస్లింలీగుకూడ ఆమోదిస్తేత మధ్యంతర ప్రభుత్వంలో చేరడానికి తిరస్కరించడం, అలీఘ విశ్వవిద్యాలయ పాలకవర్గం ఏకగ్రీవంగా తీర్మానంచేసి త కోరితేనే ఆ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షపదవిని ఆమోదించా ణయించడం వంటి విషయాలనెన్నిటినో శ్రీ నూ జాకిర్‌హుస్సేను గురించి రాస్తూ పేర్కొన్నారు.

—జయప్రకాశ్ నారాయ

# స్వర్గీయ డా. జాకిర్ హుస్సేన్‌కు పత్రికల నివాళులు

## ఆంధ్ర ప్రభ

డాక్టర్ జాకిర్ హుస్సేన్ కాలధర్మం చెందడంతో ఆధునిక భారత దేశ చరిత్రలో ఒక మహోజ్వల అధ్యాయం సమాప్తమైంది. గాంధి మహాత్ముని అవతరణతో ప్రారంభమై సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్, బాబు రాజేంద్రప్రసాద్, పండిత జవహర్‌లాల్ నెహ్రూ అఫ్జల్‌ఖాన్, డాక్టర్ అన్సారీ, మౌలానా అజాద్ ప్రభృతి మహా నాయకుల త్యాగములతో ప్రకాశించిన ఈ అధ్యాయం ఆఖరు గాంధేయుడు డాక్టర్ జాకిర్‌హుస్సేన్ అధ్యాయాంతంతో ముగింపుకు రావడం దైవనిర్ణయంగా కన్పిస్తుంది.

డాక్టర్ హుస్సేన్; మౌలానా ఆజాద్, పండితజవహర్‌లాల్ వలె రాజకీయ నాయకుడు కాదు. అన్ని కాంగ్రెసు పోరాటాలలో వీరందరివలె గాంధీజీ వెంట నడిచినవారు కాకపోయినా వీరందరి కంటే డాక్టర్ హుస్సేన్ మహాత్మునికి అత్యంత సన్నిహితుడుగా వున్నారు. తత్వశాస్త్రవేత్త అయిన డాక్టర్ రాధాకృష్ణన్ ప్రముఖ రాజకీయవేత్తగా భారత రాష్ట్రపతి పీఠం నుంచి ప్రకాశించినట్లే, ప్రముఖ విద్యావేత్తగా ప్రసిద్ధి చెందిన డాక్టర్ జాకిర్‌హుస్సేన్ రాష్ట్రపతి పీఠం నుంచి గాంధి తత్వమును ప్రబోధించి, భారత దేశ లౌకిక రాజ్యాంగ వ్యవస్థకు ప్రతిబింబంగా విరాజిల్లినారు.

నవభారత నిర్మాణానికి పునాది రాయిగా వున్న ప్రాతిపదిక విద్యా విధానాన్ని రూపొందించడంలో, ఆ విధానాన్ని అమలు చేయడానికి కార్యక్రమాన్ని సిద్ధపరచడంలో గాంధీజీ పూర్తిగా డాక్టర్ హుస్సేన్‌పై ఆధారపడినారు. గాంధీజీ 'అనధికార మంత్రివర్గంలో' వీరు విద్యా మంత్రిగా ఎంతో సమర్థతతో వ్యవహరించారు. ఢిల్లీలోని జమయత్ విద్యా పీఠం డాక్టర్ హుస్సేన్ నిర్మాణ శక్తికి నిర్వహణ సామర్థ్యానికి శాశ్వతమైన చిహ్నం.

ఆయన నిరాడంబరత, సహనశీలం, శాంతిస్వభావం, దేశాభిమానం, జాతీయత యువతరం వారికి ఆదర్శప్రాయం. విధి నిర్వహణలో, బాధ్యతలను నిర్వర్తించడంలో, సిద్ధాంతాలకు బద్ధులై వుండటంలో వారు ముందు యుగాలవారికి మార్గదర్శకులైనారు.

ప్రముఖ విద్యావేత్తను, ప్రతిభావంతులైన రాజకీయ పారంగతుని, ప్రజాస్వామిక దేశాలకు ఆదర్శప్రాయమైన రాజ్యాధిపతిని భారతజాతి కోల్పోయింది. వారి అడుగు జాడలు జీవితాదర్శాలు ఈతరానికి కర్తవ్యాన్ని వివరిస్తూ కల్లోలిత మానవాళికి శాంతి సాధనకు తోడ్పడుగాక!

## ఆంధ్ర పత్రిక

భారత దేశం మేధావులలో, ఉన్నత స్థాయి జిజ్ఞాసువులలో డా. జాకిర్‌హుస్సేన్ ఒకరు. రాజకీయ వేత్తగా, పరిపాలకుడుగా కూడా ఆయన పేరు గడించుకున్నారు. అయితే ఆయన ప్రఖ్యాతి అంతా విద్యావేత్త కావడం మీదనే ఉంది.

మహాత్మాగాంధీ భారత దేశానికి ఒక కొత్త విద్యావిధానాన్ని సమకూర్చదలచుకొన్నప్పుడు, డా. జాకిర్ హుస్సేన్ దానిని సమకూర్చారు. బేసిక్ విద్యా విధానం పేర అది ప్రఖ్యాతి వహించడమేగాక, డా. హుస్సేన్‌కు గూడా ప్రఖ్యాతిని తెచ్చిపెట్టింది.

దేశంలో అతి ప్రధానులైన గాంధీ వాదులలో డా. జాకిర్ హుస్సేన్ ప్రథమ శ్రేణిలోని వారు. 1922 లో బెర్లిన్‌కు వెళ్ళి ఉన్నత విద్య నభ్యసించి తిరిగి వచ్చిన అనంతరం నుంచి 1948 దాకా ఆ బేసిక్ విద్యా విధానాన్ని అమలు పరచడంలోనే నిమగ్నులై ఉన్నారు. 1948 లో అలీఘర్ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ అయినారు. 1957 లో బీహార్ గవర్నర్ పదవిని చేబట్టారు. 1962లో ఉపరాష్ట్రపతి అయినారు. 1967లో రాష్ట్రపతి అయినారు.

ఇన్ని పదవులు నిర్వహించినా ఆయన ఆ పదవుల యందు మమకారంలేని నిరాడంబరతను ప్రదర్శించారు. గొప్పవారై గూడా, ఆ గొప్పతనం పైకి కనిపించనీయ నంతటి నిండుగా ఆయన తమ జీవితాన్ని చక్కదిద్దుకున్నారు. పండిన అనుభవంతో దేశాన్ని దిద్దారు.

డా. జాకిర్ హుస్సేన్ ఎంత నిరాడంబరుడో అంత నిజాయితీపరుడు. ఎంతటి నిజాయితీపరుడో అంతటి మేధావి. శ్రీరాజాజీ అన్నట్లు ఆయన ఉత్తమ పౌరుడు. అలీ సోదరుల కాలంలో రాజకీయాలలో ప్రవేశించి, మహాత్మాగాంధీసహచరుడై, స్వాతంత్ర్య పోరాటంలో నలిగి దేశానికి నిరాడంబరమైన సేవచేసి, ఆ నిరాడంబరతతోనే గొప్పతనాన్ని సాధించి తమ ఆ గొప్ప తనంలో కన్ను మూశారు.

## ఆంధ్ర జనత

ప్రముఖ గాంధేయవాది, జాతీయ విద్యావేత్త, మానవతా వాది, అజాత శత్రువు, రాజర్షి అయిన డాక్టర్ జాకిర్ హుసేన్ మృతి భారత దేశానికి తీరనిలోటు.

1897 ఫిబ్రవరిలో ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరంలో జన్మించిన డాక్టర్ జాకిర్‌హుస్సేన్ భారత దేశంలో ఈ ఉన్నత పదవిని స్వయంకృషిద్వారా సాధించారు. ఇస్లాం సంస్కృతిని, భారత దేశంలో మత సామరస్య సంస్కృతిని తనలో జీర్ణం చేసుకున్న డాక్టర్ జాకిర్‌హుస్సేన్ మన దేశంలో సెక్యులర్ వ్యవస్థకు ఒక మహోన్నత ఆదర్శంగా నిలబడ్డారు. మతంపై పూర్తి విశ్వాసం ఉన్నట్లుగానే ఆయనలో భారతజాతీయ తత్వంకూడ నూటికి నూరు పాళ్ళు మూర్తీభవించింది. అందువల్లనే ఆయన రాష్ట్రపతి పదవికి ఎన్నికయినప్పుడు భారత దేశంలోనేకాక ప్రపంచంలో పలు దేశాలు హర్షం వ్యక్తం చేశాయి.

గాంధిజీ ప్రారంభించిన స్వాతంత్ర్యోద్యమంపట్ల అప్పటి కాలంలో యువతరంవలెనే ఆయనకూడా ఆకర్షితులయ్యారు. గాంధిజీ అనుచరుడుగా మారారు. నిర్మాణాత్మకమైన విధానంతో వ్యవహరించడం డాక్టర్ హుసేన్‌కు పుట్టుకతో పుట్టిన విద్యగా అబ్బింది. అందువల్లనే ఆయన స్వాతంత్ర్యోద్యమంలోకూడ నిర్మాణాత్మకమైన విధానంలోనే పాల్గొన్నారు. "జాతీయవాదం పెంపొందించడానికి 'జాతీయ విద్య' అవసరమని విశ్వసించి, అందుకోసం నిర్విరామంగా కృషిచేశారు. ఈ కృషి చిహ్నంగా జామియామిలియాలో ఇస్లామియా అనే జాతీయ ముస్లిం విశ్వవిద్యాలయం ఏర్పడింది.

విద్యారంగంలో ఆయన చేసిన కృషిని గాంధిజీ గుర్తించారు. 1937లో బేసిక్ విద్యపై తాను ఏర్పాటుచేసిన జాతీయ సంఘానికి డాక్టర్ జాకిర్‌హుస్సేనును అధ్యక్షుడుగా నియమించారు.

పరిపాలనా రంగంలోకూడ ఆయన విశేషమైన ప్రతిభా విశేషాలను ప్రదర్శించారు. బీహార్ గవర్నర్‌గా, ఆ తరువాత భారత ఉపరాష్ట్రపతిగా, రాజ్యసభ అధ్యక్షుడుగా ఆయన అన్ని పక్షాల ప్రతినిధుల గౌరవాభిమానాలను పొందారు. ఈ ఆదరాభిమానాలే ఆయన రాష్ట్రపతి పదవిని అధిష్ఠించడానికి ఎంతగానో తోడ్పడ్డాయి. రాష్ట్రపతి పదవికి పరిపాలనారంగంలో అనుభవశాలి అయిన డాక్టర్ జాకిర్‌హుసేన్ ఎన్నిక కావడంపట్ల పలువురు హర్షామోదాలను వ్యక్తం చేశారు. రాజకీయాలలో ఉంటూనే ముందుగా వ్యవహరిస్తూ 'రాజర్షి' గా ఆయన పేరు పొందారు. అందరిపట్ల సమానదృష్టితోను నిష్పాక్షికంగాను వ్యవహరించి అజాతశత్రువుగా పేరుపొందారు. ఇట్టి 'మహామనిషి'ని కోల్పోవడం భారత ప్రజలకు దురదృష్టకరం.

## ఆంధ్రజ్యోతి

డాక్టర్‌జాకిర్‌హుస్సేన్ పూలను ప్రేమించేవారు. ముఖ్యంగా గులాబీ పూలను ప్రేమించేవారు. పూలు సౌందర్యానికి ప్రతీకలు. సౌందర్యం బాహిరమైనదే కాదు ; ఆంతరమైనది కూడా. అట్టి సౌందర్యానికి ప్రతీకలుగా ఆయన పూలను ప్రేమించేవారు.

ఆయన సౌందర్యపిపాస ఎంతటిదో నిరాడంబరత సయితం అంతటిది. నిజానికి నిరాడంబరతకూడ సుందరమైనదే కదా? తొలి రోజుల పేదరికంలోను, మలి రోజుల రాష్ట్రపతి పదవిలోను నిరాడంబరత ఆయన మానసికసౌందర్యానికి చిహ్నంగా భాసించేది.

తొలి రోజులలో జామియా మిలియా వైస్ ఛాన్సలర్‌గా పనిచేస్తున్నప్పుడు ఆ సంస్థ నష్టంపై నడుస్తున్నదనే కారణాన డాక్టర్ జాకిర్ హుస్సేన్ తన జీతాన్ని మూడు వందల రూపాయల నుంచి యాభై రూపాయలకు తగ్గించుకున్నారు. ఆనాటి దేశభక్తుల త్యాగ గరిమ అటువంటిది.

ఆయన నిగర్వి, నిరాడంబరుడు, సౌందర్యోపాసి, మూర్తీభవించిన సంస్కృతి, దేశభక్తుడు. జీవితంలో అధికభాగాన్ని దేశ సేవలో, ముఖ్యంగా జాతీయ విద్యారంగంలో వెచ్చించినత్యాగశీలి. మత విభేదాలకు అతీతమైన భారతజాతీయతను నిండు మనస్సుతో కాంక్షించి, దానికై శ్రమించిన మహామనీషి. నిర్యాణం చెందిన భారత రాష్ట్రపతిగానేగాక, ఆయనకు మహా వ్యక్తిగా నేడు లోకం శ్రద్ధాంజలి ఘటిస్తున్నది.

## విశాలాంధ్ర

గుండెపోటు ఫలితంగా శాశ్వతంగా కన్నుమూసిన రాష్ట్రపతి జాకిర్ హుస్సేన్‌కు మా జోహారు లర్పిస్తున్నాము.

1920 నుండి నేటి వరకు, గాంధీజీ బోధనల సారాంశాన్ని జీర్ణించుకుని, అందుకనుగుణంగా దేశసేవ చేస్తున్న బహు కొద్ది మంది ప్రముఖుల్లో డాక్టర్ హుస్సేన్ ఒకరు.

ప్రధానంగా వీరి కృషి విద్యారంగానికి కేంద్రీకృతమైంది.

అలీఘర్ విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉంటూనే, అప్పటి ముస్లిం మత దురభిమాన వాతావరణానికి నిరసనగా, 1920 లో మరికొందరితో పాటు జాకిర్ హుస్సేన్, అందులోనుండి నిష్క్రమించారు. జామియా మిలియా ఇస్లామియా అను జాతీయ ముస్లిం విద్యాసంస్థ నేర్పరిచారు.

నాటినుండి డాక్టరు హుస్సేన్, అనేక బాధ్యతలు నిర్వహించారు. అనేక పదవులు అలంకరించారు. అలీఘర్ విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా, బీహారు గవర్నరుగా, ఉపరాష్ట్రపతిగా, చివరకు రాష్ట్రపతిగా భారతదేశ ప్రథమ పౌరులైనారు. కాని ఎన్ని చేసినా, ప్రధానంగా డాక్టర్ హుస్సేన్ విద్యావేత్త, పండితుడు, మహామనీషి, సహృదయుడు, హిందూముస్లిం ఐక్యతా ప్రచారానికి యావజ్జీవితం ధారపోసిన మహనీయుడు.

డాక్టర్‌హుస్సేన్ పెక్కుభాషలలో పండితులు, ప్రముఖ రచయిత. అన్నిటికి మించి పరమసౌమ్యుడు.

1897 లో డాక్టర్‌హుస్సేన్, హైదరాబాదులో జన్మించారు, 72 ఏండ్ల వయస్సులో కన్నుమూశారు.

1967 మే 9న రాష్ట్రపతి పదవిని స్వీకరించారు. రెండేండ్లు కూడా కాకముందే, హఠాత్తుగా మరణించటం ఎంతో విషాదకరం.

ఒక గొప్ప దేశభక్తుణ్ణి, పండితుణ్ణి మనం కోల్పోయాం.

## ఆంధ్ర భూమి

డాక్టర్ హుసేన్ అకలంక జాతీయతా వాది. అలీఘడ్ విశ్వవిద్యాలయంలో ఆర్థిక శాస్త్రంలో ఎమ్. ఎ. పట్టా తీసుకుని, అనంతరం "లా" కాలేజీలో చేరారు—1920 సంవత్సరమది, గాంధీజీ పిలుపునందుకుని న్యాయవాది విద్యకు స్వస్తి చెప్పి, జామియా మిల్లియా అనేజాతీయ విద్యాసంస్థలో ఉపదేశికునిగా చేరారు.

నాటినుండి గాంధీజీకి అత్యంత సన్నిహితులైనారు. బహుళ రీతులలో పరస్పరం ప్రభావితులైనారు. డాక్టర్ జాకిర్ హుసేన్ ప్రముఖాతి ప్రముఖంగా విద్యావేత్త. జాతీయవిద్యావిధాన వికాసానికి అంకితమై జీవించారు. పదవీ రాజకీయాల నీలినీడలకు దూరంగా ఉండేవారు.

అసాధారణమేధావి కావున రాజనీతిజ్ఞతను అలవరించు కున్నారు. రేపటిపదవికాదు ముఖ్యం — రేపటితరం. నేలబారు రాజ కీయ నేతకూ, దేశాభిమానియైన మహామనిషికీ,— అదే వ్యత్యాసం.

1962లో ఉపరాష్ట్రపతిగా ఎన్నికైనారు. 1967లో రాష్ట్రపతి బాధ్యతను స్వీకరించారు.

శాంతగంభీరమైనవదనం. మృదువైన వాక్కు. సున్నితమైన హృదయం. క్షుభిత హృదయాలను సేదదీర్చే ఉన్నతసంస్కారం

భారత రాజ్యాధినేతగా విదేశాలలో పర్యటించి మనదేశ ప్రతిష్ఠను ఇనుమడింపచేశారు.

దేశం నేడు సంక్లిష్టమైన సమస్యలను ఎదుర్కొంటున్నది ఉపదేశికులకు ఉపదేశికులాయన. ఇటువంటి సమయంలో డాక్టర్ హుసేన్‌వంటి మహాత్ముని హఠాత్తుగా కోల్పోవడం—మన దుర్విధి

## జ్యోతి (వీక్లీ)

"మరొక భారతరత్నం రాలి పోయింది." డాక్టర్ జాకిర్ హుస్సేన్ రాష్ట్రపతిగా కాక— మరొక అంతస్తులో వుండి కన్ను మూసినా భారతదేశం యిదే మాటలనుకుని వుండేది. అంతటి విశేష వ్యక్తిత్వంగల మనిషి ఆయన.

విద్యావేత్తగా విశ్వఖ్యాతి గాంచిన రాధాకృష్ణన్‌గారు రాష్ట్రపతికాగానే ఆయన రాజ్యసభ అధ్యక్షులుగా, ఉపరాష్ట్రపతిగా వరించబడ్డారు. నాటినుండి యావద్భారత దృష్టిని ఆకర్షిస్తూ—నిండుకుండ వంటి పెద్దమనిషిగా, భారతజాతికి గల సర్వమత, భాషాసంస్కృతికి ప్రతీక చిహ్నంగా గౌరవించబడ్డారు.

డాక్టర్ జాకిర్ హుసేన్ రాష్ట్రపతి కావడంవల్లనే కాదు— విద్యావేత్తగా—బహు భాషాకోవిదుడుగా, గ్రంథరచయితగా, సర్వమత సహిష్ణుత ప్రబోధకుడుగా, జీవిత సౌందర్యోపాసకుడుగా, సన్మిత్రుడుగా మనహృదయాలలో సదా స్మరింపబడగలరు.

## వాహిని

భారత రాష్ట్రపతి డాక్టర్ జాకీర్‌హుస్సేన్ ఆకస్మికంగా మనలను వీడిపోయారు. ఇది ప్రతిభారతీయునికి వ్యధ కలిగిస్తోంది.

మహోజ్వలమైన భారతీయ సంస్కృతి ఒకనాటిది కాదు. ఒక మతానిదికాదు, ఒక వర్గానిదికాదు, అనేకానేకమైన ఉపనదుల సమ్మేళనంగా ఆవిర్భవించిన మహానదివలె ఎన్నో సంస్కృతుల, ఎన్నో మత వైభవాల, ఎన్నో సంప్రదాయ భిన్నత్వాల ఏకత్వమే మన మహాభారత సంస్కృతి.

ఈ సముజ్వల సంస్కృతి మత విద్వేషాలకు, వర్గ వ్యత్యాసాలకు, వర్ణవైషమ్యాలకు అతీతస్థితిలో—యావత్ ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించి, ఆలోచింపజేసి వైశిష్ట్యాన్ని సాధించింది.

ఈ మహారథ చలనానికి, పురోగమనానికి అందరూ చేయూతనిస్తున్నారు. ఎవరికివారు ఏ మతస్థులమని చెప్పుకున్నా 'అందరం భారతీయులం!' అని ఒకే వాణిని ప్రవచిస్తున్నారు.

ఇట్టి మహోజ్వల సంస్కృతికి పతాక చిహ్నమే ఒక అల్పసంఖ్యాక వరీయుడు—అఖిలభారత రాష్ట్రపతిగా అధిష్ఠించిన డా॥ జాకీర్‌హుస్సేన్.

రాష్ట్రపతి పదవిలోవుండి రాజలాంఛనాలతో అంతిమ యాత్రను కొనసాగించిన డాక్టర్ జాకిర్‌హుస్సేన్ భారతీయ విద్యారంగౌన్నత్యానికి పాటుబడ్డ ప్రముఖవ్యక్తిగా ప్రజల హృదయాలలో ఎల్లకాలం జీవించే వుంటారు.

## కృష్ణా పత్రిక

భారత రాష్ట్రపతి డా॥ జాకీరు హుస్సేను ఈ నెల 3వ తేదీన హఠాత్తుగా మరణించారన్న వార్త ఒక్క భారతదేశాన్నే కాక యావత్ప్రపంచాన్ని విషాద తరంగాలలో ముంచివేసింది. నెహ్రూ, లాల్‌బహదూర్‌శాస్త్రిల మరణానంతర్యాత యింతటి దుఃఖ వార్తను భారతీయులు వినలేదు.

ఆయన సౌమ్యుడు, సరళస్వభావుడు, నిరాడంబరుడు, మితభాషి, స్వీయ మత ధర్మ నిష్ఠాగరిష్ఠుడు కూడా. కాని మత దురభిమాన రహితుడు, సమదర్శి—ఈ అన్ని లక్షణములూ ఆయనలో సమపాళ్ళలో మేళవించబడినందువలననే ఆయన అన్ని రాజకీయ పక్షముల, మతస్థుల ప్రేమాభిమానాలను, గౌరవ మన్ననలను చూరగొన్నారు.

డా॥ జాకీరు హుస్సేన్ విద్యావేత్త. గాంధీజీ వూహించిన బేసిక్ విద్యకు రూపం కల్పించిన ఘనత డా॥ జాకీరు హుస్సేనుదే. ఖాన్ అబ్దులుగఫర్ ఖాన్, మౌలానా అబులు కలాం అజాద్ వలెనే డా॥ హుస్సేనుకూడా గాంధీ సిద్ధాంతం ప్రభావానికి లోనయి గాంధేయ పథాన్ని స్వీకరించారు.

డా॥ జాకీరు హుస్సేను మరణంతో ఒక పరిపాలనాదక్షుణ్ణి, గాంధీ సహచర పరంపరలో చివరివారిని దేశంకోల్పోయింది ఈ లోటు యింతటితో తీరునది కాదు.

## జమీన్ రైతు

పదవిలో వుండగా ఇరువురు ప్రధానులను కోల్పోయింది భారత దేశం; ఇపుడు రాష్ట్రపతిని కూడా పోగొట్టుకున్నది. ఐదేళ్లలో ముగ్గురు మహా నాయకులను కబళించింది మృత్యువు.

భారత దేశం రిపబ్లిక్ అయిన తర్వాత రాష్ట్రపతి స్థానాన్ని అలంకరించిన ముగ్గురూ ఆ స్థానానికి పూజ్యత చేకూర్చినవారు. ఆ స్థానంకంటే మహోన్నతులుగా గౌరవపాత్రులైనవారు కావడం నిజంగా మనకు గర్వకారణం.

అనేక మతాలకు, అనేకకులాలకు నెలవైన భారత ఏకత్వానికి మతాతీతమైన భారత రాజ్యాంగ వ్యవస్థకు,సమాన హక్కులు గల భారత ప్రజాస్వామ్యానికి డాక్టర్ జాకిర్ హుసేను ప్రతీకగా నిల్చారు. వారిని రాష్ట్రపతిగా ఎన్నుకోవడంద్వారా భారత రాజ్యాంగం సార్థకమైంది, పునీతమైంది. వారు భారత ప్రజాస్వామికాన్ని మరింత కీర్తివంతం చేశారు.

## ఇండియన్ ఎక్స్‌ప్రెస్

## (ఫ్రాంక్ మొరేస్)

ప్లేటో ఆదర్శరాజ్యంలో రాజులు తత్త్వవేత్తలైతే, తత్త్వవేత్తలు రాజులై వుంటారు. డా॥ జాకిర్ హుస్సేన్‌కు ముందున్న రాష్ట్రపతి లాగ ఆయన తత్త్వవేత్తకాదు.కాని ఆయన చేసిన అనేక ఉద్ఘాటనవాదాలలో ప్లేటో రిపబ్లిక్‌కూడా ఉండడం. ఒక విశేషం.జీవితాన్ని గూర్చి జాకిర్ హుస్సేన్ దృక్పథం తత్త్వవేత్తల దృక్పథంలాటిది. తృళ్ళిపరుగెత్తే రాజకీయ ప్రవాహంనుంచి తప్పుకొని సంకుచితమైన గట్లను దాటుకుని దూరంగా ప్రశాంతంగా మైదానంలో కదిలే స్రవంతి ఆయన జీవితం. స్వతహాగా ఆయన పండితుడు. దానికితోడు క్రమానుగతమైన శిక్షణకూడా అలవడింది. ఏ సమస్యనన్నా పరిష్కరించే పద్ధతిలో యీ విషయం స్పష్టంగా కనిపిస్తుంది. గాంధీజీకీ, ఆయనకూ చాలా పోలికలున్న విషయం చాలా మందికి తెలీదు. కొన్ని విషయాలలో వారిద్దరి మధ్య భిన్నత్వంవున్నా. సత్యం, సౌందర్యం – యీ రెండు ప్రధాన విషయాల్లోనూ వారిరువురు ఒకరికొకరు అతి సన్నిహితులు. ఈ యిరువురి దృష్టిలోనూ సత్యం అంటేనిజాయితీ, సౌందర్యం అంటే నిరాడంబరత. సత్యమే సౌందర్యం, సౌందర్యమే సత్యమని కీట్సు చెప్పిన దానితో యీ యిరువురూ ఏకీభవిస్తారు.

స్వార్థ రాజకీయవేత్తలమధ్యకన్నా ఆయన పుస్తకాల మధ్యా, గులాబీలమధ్యా, చిత్రాలమధ్యా అమితానందం పొందుతారు. తాను భారతీయుడైనందుకూ, ముసల్మాను అయినందుకూ ఆయన గర్విస్తారు. తన మాతృదేశాభిమానానికీ, తన మతానికీ, తన సర్వమతసహనానికీ ఆయన ఉప్పొంగిపోతారు. తన మతాన్ని, ఇతరులమతాన్నీ సమానంగా గౌరవిస్తారు. ఇతరులనుంచి అదే గౌరవాన్ని ఆశిస్తారు. సర్వమత సహిష్ణుతకు ఆయన చక్కటి నిదర్శనం. రాష్ట్రపతి జాకిర్ హుస్సేన్ జీవితంలో అధికభాగం పాఠశాలలు, విశ్వవిద్యాలయాల పరిశుద్ధవాతావరణంలోనే గడిచింది. 1920లో మహాత్మాగాంధీజీ పిలుపునందుకుని లా చదువును పరిత్యజించి జమియమిలియా ఇస్లామియాను ఏర్పాటుచేసి గాంధీజీ, ఆయన అనుచరులు నెలకొల్పిన వివిధ విద్యాపీఠాల మాదిరిలో ముసల్మానులకు జాతీయ విద్యా కేంద్రంగా దానిని దినదిన ప్రవర్థమానంగా రూపొందించారు.

నేటి క్లిష్టపరిస్థితిలో రాష్ట్రపతి జాకిర్ హుస్సేన్ మరణం ఏవిధంగాచూసినా అశనిపాతంవంటిదని అనవచ్చును. విజ్ఞతగల రాజకీయ వేత్తగా ఆయనను ప్రజలు గుర్తుంచుకుంటారు. తన ఆశయాలకు తన బాధ్యతలకు కట్టుబడి పరిశ్రమించిన వ్యక్తిగా ఆయనను గుర్తుంచుకుంటారు. నమ్రత, జాలి, దయ మూర్తీభవించిన మానవుడాయన. తన బాధ్యతా నిర్వహణలోనే ఆయన మరణించారు, ఆయన కోరుకున్నదికూడా అదేకావచ్చు.

## డక్కన్ క్రానికల్

హైదరాబాదులో గత సంవత్సరం అక్టోబరు 5వ తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవాలకు ప్రారంభోత్సవం చేస్తూ "ప్రస్తుతం దేశంఎదుర్కొంటున్న క్లిష్టపరిస్థితిలో మన జాతీయజీవితంలో పునరుజ్జీవనం రావడం చాలా అవసరం" అని అన్నారు డా॥జాకిర్ హుస్సేన్ ఆనాటి ఆయనమాటలు ఎంతో అర్థంతో ప్రతిధ్వనించాయి ఎంతో సహృతతో స్పందించాయి. మన సాంప్రదాయక విలువలు ఎలా అలక్షింపబడుతున్నాయో, అందుకాయన హృదయం ఎలా కొట్టుకుంటోందో వినిపించాయి. సువిశిత రాజకీయవేత్త, ప్రముఖవిద్యావేత్త, నిష్కళంక దేశభక్తుడూ, సెక్యులర్ వ్యవస్థకు పెట్టని కోటవంటివాడూ అయిన జాకిర్ హుస్సేన్ భారత దేశం అత్యంత క్లిష్టపరిస్థితుల్ని ఎదుర్కొంటున్న కాలంలో జీవించాడు. అన్ని కష్టాలనూ, అన్ని సమస్యలనూ నిర్భయంతో ఎదుర్కొన్నారు. ఆయన జీవన విధానం అత్యంత నిరాడంబరమైనది. ఆయన మాటలో పరుషానికి తావు లేదు: విద్వేషానికి చోటులేదు. ఆయన చేతల్లో ఎక్కడా పిచ్చి ఆవేశం కనిపించదు. సమస్యలను పరిష్కరించడంలో గుడ్డి నమ్మకాలకు తావివ్వక విజ్ఞతతో ఆలోచనాయుతంగా చేపట్టడం ఆయనలో

కనిపిస్తుంది. కుల, మత, వర్గ ప్రమేయం లేకుండా అందరిచేత తన జీవిత కాలంలోనే జాకిర్ హుస్సేన్ గౌరవింపబడగలిగారు.

ముందు ముందు ఆయన ఒక గొప్ప పురుషుడు కాగలడనీ, కీర్తి ప్రతిష్ఠలతో అలరారగలడనీ అనుకోడానికి ఆయన బాల్యంలో ఎలాంటి చిహ్నాలు ఆట్టే కనిపించలేదు. అయినా సమున్నతమైన కీర్తి శిఖరాన్ని ఆయన అతి నిదానంగా ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ చేరుకోగలిగారు. గాంధీజీతో పరిచయం ఆయనపై విశేషమైన ప్రభావాన్ని కలిగించింది. జాతిపితమీద గాఢమైన గౌరవాభిమానాలు ఏర్పడ్డాయి. ఆయన అడుగుజాడల్లో నడవడం ప్రారంభించారు డా॥ జాకిర్ హుస్సేన్ తన హృదయానికి అత్యంత సన్నిహితమైన విద్యారంగానికే తనను తాను అంకితం చేసుకునేవారే. అయితే ఆయన రాజకీయ స్రవంతిలోకి దిగక తప్పలేదు. అయినప్పటికీ విద్యారంగంలో తన ప్రాతిపదిక విధానాలను రూపకల్పన చేయడంలో ఆయన ఒక సరికొత్త మార్గాన్ని అవలంభించారు. తనదైన వ్యక్తిత్వాన్ని చూపించారు. విద్యారంగానికి సేవచేయాలనే గాఢ వాంఛ కారణంగా జమియ మిలియాను వ్యవస్థాపించి పరిపోషించారు. ఈ నాడు ఆయన శాశ్వతంగా విశ్రాంతి తీసుకునే స్థలంకూడ జమియమిలియాకావడం ఎంతయినా సమంజసంగా వుంది. జమియమిలియాలో బోధిస్తున్న రోజుల్లో కూడా తన విజ్ఞాన కాంక్షను, విద్యాసముపార్జనను మరిచిపోలేదు. ఆ నిరంతర అధ్యయనంలోనే ఆయన గొప్పతనం నిండివుంది.

డా. జాకిర్ హుసేన్ విపరీతంగా చదివేవారు. రచనల్లో ఆయనకు మంచి ప్రవేశంవుంది చక్కటి అభిరుచులు అనేకం వున్నాయి. విదేశ పర్యటన వల్ల ఆయన దృక్పథం, అభిరుచులు విస్తృతమైనాయి. అనేక విషయాలను అవగాహన చేసుకున్నారు. విద్యా విధానాన్ని సంస్కరించేందుకు అవి ఆయనకు అమితంగా దోహదం కలిగించాయి. భారతీయ సంస్కృతిని వర్తమాన కాలానికి అనుగుణంగా అన్వయింపజేయగల విధంగా విద్యను తీర్చిదిద్దే బేసిక్ విద్యా విధానం ఆయననుంచి మనకు సంక్రమించే అవకాశం ఇందువల్లనే మనకు లభించింది. ఈ విధమైన బేసిక్ దృక్పథంమీదే డా. జాకిర్ హుసేన్ ఉన్నత విద్యా విధానాన్ని అంచెలంచెలుగా నిర్మించుకొచ్చారు.

డా. జాకిర్ హుస్సేన్‌కు మనం ఎంతగానో ఋణపడి వున్నాం. మత ప్రమేయంలేని విధానానికి, జాతీయ భావానికీ పునరంకితులమై విద్యారంగాన్ని పటిష్ఠమైన మార్గాలలో వుంచే బాధ్యత మనమీద వున్నది. ప్రజలకు వెలుగుచూపిన మహాత్ముల కోవలోనివారు డా. జాకిర్ హుస్సేన్. అట్టి మహాత్ముల సంఖ్య క్రమక్రమంగా తగ్గిపోవడం మన దురదృష్టం.

## డైలీ న్యూస్

దేశపు ప్రథమపౌరుని స్థానానికి ప్రఖ్యాతులైన వ్యక్తులు ఎన్నిక కావడం భారత దేశం అదృష్టం. ఈ పదవి నలంకరించిన ప్రథమవ్యక్తి డా. రాజేంద్రప్రసాద్. అకలంక దేశ సేవకుడుగానూ, త్యాగశీలుడుగానూ. విద్యావేత్తగానూ ఖ్యాతి గాంచారు. ఆయనకు వారసుడుగావచ్చిన డా. సర్వేపల్లి రాధాకృష్ణన్, ౘ తీయ తత్త్వశాస్త్రాన్ని. ఆధ్యాత్మికతనూ మథించిన విజ్ఞాని. తదనంతరం ఈ పదవిలోనికి వచ్చిన డా. జాకిర్ హుస్సేన్ గొప్ప పండితుడు. విద్యావేత్త. ఆయన గాంధీజీతో కలిసి ప్రాతిపదిక విద్యా విధానమనే సరి క్రొత్త భావాలను ప్రతిపాదించారు. డా. జాకిర్ హుస్సేన్ మూర్తీభవించిన జాతీయవాది. ఆయన గాంధీజీ స్వరాజ్యఉద్యమం ప్రారంభించిన తొలి దశలో అలీఘడ్ ముస్లిం విశ్వవిద్యాలయాన్ని వదిలి తమ అభిప్రాయాలకు అనుగుణంగా ఢిల్లీలో జమియమిలియాను నెలకొల్పారు. దేశానికి దీర్ఘకాలంపాటు ఆయనచేసిన నిస్వార్థసేవకు చిహ్నంగా ఈ సంస్థ నిలిచిపోతుంది.

## హిందుస్థాన్ టైమ్స్ వీక్లీ

ఈ రోజు దేశం గాఢ సంతాపంలో మునిగివుంది. దేశపు ప్రథమపౌరుడు నిర్యాణం చెందడంతో అపూర్వమైన, అమోఘమైన గుణగణాలు కలిగిన ఒక గొప్పవ్యక్తి లేనిలోటు ఏర్పడింది. అతి ఉన్నతమైన రాష్ట్రపతి పదవిని ఆయన అమిత హుందాగా నిర్వహించారు. ఆయన పండితుడు, రచయిత, రసజ్ఞుడు, మానవతావాది. సాంఘిక కార్యకర్త పై అంతస్తులో అనవరతమూ ఆయనసంచరించినప్పటికీ సామాన్యులతో సంబంధం పెట్టుకున్నారు. ప్రజల గౌరవాభిమానాలతో పాటుగా ప్రేమవాత్సల్యాలను కూడా చూరగొన్నారు. డా. జాకిర్ హుస్సేన్ రాష్ట్రపతిపదవి నలంకరించడం మనలౌకిక విధానానికి మనవిజయమని సర్వేసర్వత్రా హర్షం ప్రతిభారతీయునికీ ప్రాతినిధ్యం వెలిబుచ్చబడింది. ఆయనవ్యక్తిగానూ. రాష్ట్రపతిగానూ వహించారు సమస్తజాతి తరవున మాటాడారు. ఆయన సంపూర్ణమైన భారతీయుడు. సామాన్యజనుల సేవకు అంకితుడయ్యాడాయన

## స్టేట్స్‌మన్

డా. జాకిర్ హుస్సేన్ హఠాన్మరణం చెందడంతో దేశానికి తీవ్రనష్టం వాటిల్లింది. ఆయన రాష్ట్రపతిగావున్న కొద్ది కాలంలో ఆశించినదానిని మించి సాధించారు, ప్రభుత్వానికి వివేకవంతుడైన సలహాదారుగానూ, దేశపు రాజకీయ చైతన్యం రక్షకుడుగానూ, ఆయన నిరూపించుకున్నారు. గత రెండు సంవత్సరాలలో దేశంలో ఏర్పడిన అన్ని రాజకీయ వివాదాలకూ ఆయన అతీతుడుగా వ్యవహరించారు.

స్వర్గీయ రాష్ట్రపతికి "విద్య" అత్యంత ప్రీతిపాత్రమైనది. జాతీయావసరాలకు అనుగుణంగా విద్యావిధానాన్ని మలచడానికి ఆయనచేసిన సేవ అనుపమానమైనది. ఆయన సద్గుణ సంపన్నుడు. అవసరమైనప్పుడు నిర్మొహమాటంగా మాట్లాడే స్వభావం ఆయనది. ఆయన అధికార బాధ్యతలు, ఎప్పుడుకూడ గులాబీల పెంపకం, బాలవాఙ్మయ సేవ వంటి ఆయన వ్యాపకాలకు ఎంత మాత్రం అడ్డంకులు కాలేదు.

